# ప్రొక్కుబడి

(ఇంకా ఇతర నాటికలు)

మొక్కపాటి నరసింహశాస్త్రి

మొక్కపాటివారు
* మదరాసు *

సహృదయుడు, రసికుడు, ఉదారుడు,

అవిరతోత్సాహి, మిత్రుడు,

చిరంజీవి,

**జయంతి కామేశ్వరరావుకు**

ఈ నాటికల సంపుటి ఆదరంతో అంకితమిస్తున్నాను.

# మ్రొక్కుబడి

## పాత్రలు

| | |
|---|---|
| వెంకటేశ్వర్లు (అంధుడు) | మంగమ్మ తండ్రి<br>75 సం॥ వృద్ధుడు |
| మంగమ్మ | 50 సంవత్సరముల<br>వితంతువు |
| డాక్టరు | అలోపతి వైద్యుడు<br>40 సం॥ వయస్సు |
| సుకుమార్ | మంగమ్మ అల్లుడు<br>25 సంవత్సరములు |
| రాజ్యలక్ష్మి | మంగమ్మ కూతురు<br>19 సంవత్సరములు |
| చంద్రశేఖరం | ఆయుర్వేదవైద్యుడు |

## ( స మ య ం — ఉ ద య ం )

(హాలులో ముసలి అంధుడు వెంకటేశ్వర్లు గారు ఒక కుర్చీలో ముడుచుకు కూర్చుని శ్రీ వెంకటేశ్వరస్తవం చేస్తుంటాడు. ప్రక్కగదిలోనుంచి మూలుగు వినపడుతూ ఉంటుంది.

వెంకటేశ్వర్లు

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ।
ఉత్తిష్ఠగరుడధ్వజ ।
ఉత్తిష్ఠకమలాకాన్త ।
త్రైలోక్యంమంగళంకురు ॥

అత్ర్యాది సప్తఋషయ స్సముపాస్య సంధ్యా
మాకాశసింధుకమలాని మనోహరాణి
ఆదాయ, పాదయుగ మర్చయతుం ప్రసన్నాః
శేషాద్రి శేఖరవిభోతవ సుప్రభాతం!॥

ఈ షత్ప్రఫుల్లసరసీరుహనారికేళ ।
పూగద్రుమాదిసుమనోహరపాళికానాం ।
ఆవాతిమందమనిలస్సహదివ్యగంధైః ।
శేషాద్రిశేఖరవిభోతవ సుప్రభాతం ॥

ఉన్మీల్యనేత్రయుగముత్తమపంజరస్థాః ।
పాత్రావశిష్టకదళీఫలపాయసాని ।
భుక్త్వాసలీలమథకేళిశుకాఃపఠంతి !
శేషాద్రిశేఖరవిభోతవ సుప్రభాతం ॥

(ప్రక్కగదిలోనుంచి మంగమ్మ ప్రవేశిస్తుంది. ఆ ఆలి కిడివిని)

వెంకటేశ్వర్లు

అమ్మాయి! అమ్మాయి!

మంగమ్మ

(కళ్ళు వొత్తుకుంటూ) ఏం! నాన్నా!

వెంకటేశ్వర్లు

పిల్ల ఎలా ఉందమ్మా? ఊరికే అలా మూలుగుతున్నది అన్తమానమూను.

మంగమ్మ

ఎలా ఉందని చెప్పనూ! తెల్లవార్లూ, ఒక్కమాటూ కంటి మీద కునుకులేదు. ఒళ్ళెరగదు! ఏదో బాధపడుతోంది బిడ్డ! మొద్దులా ఏమీ చెయ్యలేక అలాచూస్తూ ఊరుకున్నాను. ఏం లాభం! ఎన్నాళ్ళకీ ఏమార్పూ కనబడదాయె. నా తల్లి నాకు దక్కేటట్టు లేదు. ఈ లోకంలో లేదు. ఒళ్లు తెలియనిబాధ తప్ప ఇంకేమీ ఎరుగదు.

వెంకటేశ్వర్లు

అధైర్య పడకమ్మా అలాగ! మరేం భయంలేదు. ఇంతకీ వైద్యు డేమంటాడు?

మంగమ్మ

ఏ మంటాడుని రావడం, చూడ్డం, ఏవో మందులు పొయ్యడం, ఒళ్ళంతా తూట్లు పడేటట్టు ఇంజక్షన్లు ఇవ్వడంతప్ప, ఫలానా జబ్బని కాని, ఇదిచెడు అనికాని, ఇదిమంచి అనికాని, నోరు విప్పి మాట్లాడడు. ఇప్పుడు లోపల పరీక్ష చేస్తున్నాడు.

వెంకటేశ్వర్లు

ఏవో మరి! ఆయన శాయశక్తులా తంటాలు పడుతున్నాడు. వైద్యుడంతకంటె ఏమి చెయ్యగలడు!

మంగమ్మ

ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు! ఏమి చేసినా ఆయేడుకొండల వాడు చెయ్యాలి కాని-

వెంకటేశ్వర్లు

అఖరుమాటంతే!

మంగమ్మ

అలా అని మొండితనంగా ఊరుకోలే మాయెను. అప్రాణం- బెంగతో మతి పోయి ఏమి తోచదు. అలాకాదు ఇలా చెయ్యమని సలహా ఇచ్చేవారేనా లేరాయెను. పోనీ పిల్లను వాళ్ళింటికేనా పంపించాను గాను. వాళ్ళేమైనా ఇంతకంటే జాగ్రత్తగా చూసుకొందురేమో ననుకుంటాను మధ్యమధ్యను.

వెంకటేశ్వర్లు

వెర్రికాని అక్కడమట్టుకు ఇంత కంటే ఎక్కువ ఏమి చెయ్యగలరు? మన శక్తివంచన లేకుండా చేస్తున్నాం. ఆయుర్వేదంలోనూ, ఇంగ్లీషు వైద్యంలోనూ హేమాహేమీ లనుకున్న వాళ్ళను డబ్బుకోసం చూసుకోకుండా తీసుకొచ్చి చూపిస్తుంటిమి. నువ్వన్నట్లు ఆ స్వామికటాక్షముండాలి. మన మేలోటూ మాత్రం చెయ్యడం లేదు.

మంగమ్మ

ఎన్నికబుర్లు పంపినా, ఎన్నిఉత్తరాలు వ్రాసినా, దాని

మొగుడేనా, ఊడి రాడాయెను! నిన్న టెలిగ్రాము కూడా యిప్పించాను.

వెంకటేశ్వర్లు

సరే అయితే ఇంక నేం—ఇంకా స్పేపటికి దిగుతాడు.

మంగమ్మ

అతను వస్తే బాగుండునని వుంది; వస్తే ఎలాగని భయంగానూ వుంది.

వెంకటేశ్వర్లు

ఏమి ?

మంగమ్మ

ఏమీ లేదు, అతను వట్టి వ్యతికరణంమనిషి. అతని కెంత తోస్తే అంతేకాని ఫాలాక్షు డొచ్చి చెప్పినా వినిపించుకోడు.

వెంకటేశ్వర్లు

ఈకాలం కుర్రవాళ్ళ పద్ధతే అంత. ఇంతకూ అతని పెంకితనం నిన్నేమి చేస్తుంది ?

మంగమ్మ

మరేంలేదుకాని, ఒక సందేహం బాధిస్తోంది. ఎవరేమన్నా సరే కాని ఈ ముక్కూ మూలంలేని జబ్బువంట పుట్టింది కా దని నా నమ్మకం. ఆ వడ్డీ కాసులవాడి ప్రభావ మిదంతా ననిపిస్తున్నది. ఈ మాటంటే అతను వేళాకోళాలూ, వెక్కిరింతలూ ఆరంభిస్తాడు.

వెంకటేశ్వర్లు

పోనీ, అలాగే అనుకో! నీనమ్మకం నీది! దాని కతని వేళాకోళా లెందుకు ?

మంగమ్మ

ఎందుకా! దాని పెళ్లిముందు మొక్కుకున్నాను, పెళ్ళి కాగానే వాళ్ళిద్దరినీ తీసుకొని కొండఎక్కి స్వామిదర్శనం చేయిస్తానని. నాటినుంచి నేటివరకూ, ఎన్నిసార్లు అతనిని బ్రతిమాలినా నన్ను వేళాకోళం చెయ్యడమే కాని, అతను మట్టుకు రాలేదు. అందుచేత మేము వెళ్ళడంపడలేదు. కార్యం ముందు ఇలాగే, చచ్చినంత జబ్బుచేస్తే అప్పుడు మళ్ళీ మొక్కుకున్నా, నిలువు దోపు ఇస్తానని. నిమ్మళించడం, కార్యం జరుగడం అయిందా? ఆ మొక్కు చెల్లిద్దామని ఎన్నివిధాల ప్రయత్నం చేసినా, అతను దాని వంటిమీద వస్తువు చిన్నం బంగారమేనా కదపడానికి వల్లకాదంటాడు. మళ్ళీ కావలిస్తే నన్ను చేయించి ఇచ్చుకోమంటాడు. నాకనేక సార్లు ఆ స్వామి కనబడి తల కూడా ఇమ్మన్నాడు.

వెంకటేశ్వర్లు

ఆహా! గట్టిపేచీ వచ్చిందే! దానికత ససలే వప్పుకోదు స్వామికూడా కాలాన్ని పట్టి కొంతమార్పు చేసుకొని ఇలాటి కోరికలు మానుకుంటే బాగుండును.

మంగమ్మ

నీవుకూడా అలా మాట్లాడుతా వేమిటి నాన్నా!

వెంకటేశ్వర్లు

వెర్రిదానా! తరుచుగా జాగ్రదవస్థలో అవ్యక్తంగా వున్న మనఊహలూ సంకల్పాలే, మనస్వప్నంలో కనుపించేది. మళ్ళీ మెళుకువ వచ్చిన తరువాత, ఈ స్వప్నాలు జ్ఞాపకం వచ్చి, మన సంకల్పాలను బలపరచి, ఆచరణకు పురికొల్పు

తాయి. దేవుడికి ఏమి కావలెనమ్మా! ఆయన కేమి లోటు—
నిజంగా ఆయనకు లోటే అయిన నాడు మనం తీర్చగలమా?

మంగమ్మ

నీ వేదాంతాని కేమి లెద్దూ—

(ఇంతలో లోపలనుంచి డాక్టరు ప్రవేశం)

మంగమ్మ

(ఖంగారుగా నిలబడి) ఏం నాయనా! నా బిడ్డసంగతి ఏం చెప్పారు!

డాక్టరు

(మాట్లాడడు)

మంగమ్మ

ఏం నాయనా! అయ్యో ఇం కేముంది! (అని గదిలోకి వెడుతుంది)

వెంకటేశ్వర్లు

ఏమండీ డాక్టరుగారూ! పిల్ల ఎలా ఉంది? మీ అభిప్రాయ మేమిటి?

డాక్టరు

(మాట్లాడడు)

వెంకటేశ్వర్లు

మీ రేమీ సందేహించక ఉన్న స్థితి ఏమిటో చెప్పాలి.

డాక్టరు

సందేహ మే ముంది? కాని ఏమి చెప్పాలో తెలియడం లేదు. నేను ప్రాక్టీసు ప్రారంభించిన తరువాత ఇటువంటి కేసు ఎప్పుడూ చూడలేదు.

వెంకటేశ్వర్లు

అయ్యో!

డాక్టరు

ఎంత ప్రయత్నం చేసినా దీనిముక్కుమూలం తెలియడం లేదు. ఇంతవరకూ ఇది ఫలానా వ్యాధి అని నిరూపించలేక పోయినాను. దీనికి వేరే పేరు పెట్టవలసి వచ్చేటట్టుంది. నాకు తెలియక అలా విడిచి పెట్టా ననుకుంటా రేమోనని, ముగ్గురు **Specialists** ను, కూడా తీసుకొచ్చి పరీక్ష చేయించాకదా. వాళ్ళకుకూడా ఏమీ అంతు పట్టలేదు. నేను చేయ తగ్గిది ఏమీ కనుపించదు. రత్నంకాంటిపిల్ల. అలా విడిచి పెట్టడానికి ప్రాణం వప్పడం లేదు.

వెంకటేశ్వర్లు

పోనీ, మరోసాధకం ఏమైనా చేయించమంటారా?

డాక్టరు

అంటే?

వెంకటేశ్వర్లు

ఏ ఆయుర్వేద వైద్యమో చేయించి చూస్తేనో—

డాక్టరు

మీ కేమి టా వెర్రి! శాస్త్రీయమైన వైద్యం, పెద్ద పేరు పొందిన వైద్యులూ బుర్రలు బద్దలు కొట్టుకుని ఏమీ చెయ్యలేక నోరుమూసు కూరుకుంటే, ఏదో గచ్చాకూ, పుచ్చాకూ నలిపి ఇచ్చేవాళ్ళ చేతిలో పెడతా నంటా రేమిటి కేసు-

వెంకటేశ్వర్లు

గచ్చాకైనా పుచ్చాకైనా దానికీ ఒక శాస్త్రమూ పద్ధతీ

ఉంది కాదూ ? దానివల్లా రోగాలు కుదురుతోనూ ఉన్నాయి, అంతేకాకుండా మీ కసాధ్యం అనిపించిన వ్యాధులు అనేకం వాళ్ళు కుదురుస్తూనూ ఉన్నారుగదా.

డాక్టరు

నేను నమ్మను. అది వట్టి గ్రుడ్డివాడి చేతిలో రాయిలాంటిది. ఏదో ఒకరోగం కాకతాళ న్యాయంగా కుదిరినా అంత మాత్రం చేత అదో పెద్ద శాస్త్రం ఎలా అవుతుంది.

వెంకటేశ్వర్లు

ఏమో కాని, నాబుద్ధి కతీత మైనదీ, నాదృష్టి కగోచర మైనదీ, అసత్యమని కాని, అసలు లేదని కాని అనేటంత సాహసం నాకు లేదుసుమండీ. సరే దాని కేమికాని, మరిప్పు డేమిటి చెయ్యతగ్గది. ఒక దణ్ణంపెట్టి ఊరుకో వలసిందేనా !

డాక్టరు

మీకు కోపం వచ్చినా సరే కాని Quacks చేతుల్లోపడి బతికేకంటే, శాస్త్రంబాగా తెలిసిన వైద్యుడు చేతులో చావు మంచిది. క్షమించండి, ఇంత నిర్మొగమాటంగా అన్నందుకు. మీ అమ్మాయి ఏదేనా miracle వల్ల బ్రదకవలసిందే కాని మానవ మాత్రు డేమీ చెయ్యలేడు. సెలవు.

(ఈయన బయటకు వెడుతుంటే అమ్మాయిభర్త సుకుమార రావు లోపలికి వస్తాడు. గుమ్మంలో ఒకరి నొకరు చూసుకుంటారు. డాక్టరు వెళ్ళిపోతాడు. ఇతను లోపలికి వస్తాడు.)

వెంకటేశ్వర్లు

ఎవరువారు ?

సుకుమార్

నేనండీ తాతగారూ, సుకుమార్‌ని. ఎలా ఉందండీ మీ మనుమరాలు ?

వెంకటేశ్వర్లు

వచ్చావునాయనా ! ఇంకా రాలేదేమో అనుకుంటున్నాం ఎలా ఉందని చెప్పను ! ఇన్నాళ్ళనుంచీ పరీక్ష చేస్తున్న వైద్యుడు, ఈ వ్యాధేమిటో తన కంతు పట్టడం లేదని ఇప్పుడే చెప్పి వెళ్ళాడు.

(ఇంతలో గదిలోనుంచి మంగమ్మ ప్రవేశం)

మంగమ్మ

వచ్చావు నాయనా ! (అని కంట తడి పెట్టుకుంది.)

(ఒక్క క్షణం నిశ్శబ్దం)

సుకుమార్

ఏదీ—ఎక్కడుంది ?

(మంగమ్మ గదివైపు దారి తీస్తుంది. ముగ్గురూ నిశ్శబ్దంగా లోపలికి వెడతారు.)

## ౨

(గదిలో మంచంమీద అమ్మాయి ఒళ్ళు తెలియకుండా ఇటూ అటూ దొర్లుతూ మూలుగుతూ ఉంటుంది. సుకుమార్ ఒక్క అంగలో మంచం దగ్గరకు వెళ్ళి భార్యను కౌగలించుకొని ఏడుస్తాడు. మంగమ్మ కాళ్ళకాళ్ల దిక్కున నిలబడి విచారిస్తూ ఉంటుంది. ముసలాయనఒక కుర్చీమీద కూర్చుంటాడు.)

వెంకటేశ్వర్లు

నాయనా! సుకుమార్! ఊరుకో బాబూ ఏమిటి అలా అధైర్య పడతావు?

సుకుమార్

(నిశ్శబ్దం-ఏగుపులు మాత్రం విన పడుతుంటాయి.)

వెంకటేశ్వర్లు

అమ్మాయి, ఏమిటది? అతనికి కాస్త ధైర్యం చెప్పడం పోయి, ముందు నువ్వే ఇలా అయితే ఎలాగు? కంఠంలో ప్రాణమున్నంతసేపూ, మనం పరమేశ్వరుడుమీద భారంవేసి ధైర్యంగా ఉండవలసినదే-

మంగమ్మ

(కళ్లు తుడుచుకుంటూ) లే! నాయనా, లే! విచారించి ఏమి చెయ్యగలం? ఆ శ్రీ వెంకటేశ్వరులువారే ఉన్నారు. అన్నింటికీని.

వెంకటేశ్వర్లు

రా! బాబూ, ఇలా రా; కూచో ముందుసంగ తేమిటి?

సుకుమార్

ముందు సంగ తేమి టంటే, నేను మట్టుకు ఏమి చెప్ప గలను ఇప్పుడు? ఇంత ఎక్కువగా ఉన్న దనుకో లేదు. కాస్త ముందుగా తెలిస్తే, పోనీ, ఆ చెన్నపట్టణమే తీసుకువెళ్ళ డమో, ఏదో చేసేవాణ్ణి. కొంపమీది కొచ్చేవరకూ నాకు సరిగా తెలియపరిచారు కారు.

వెంకటేశ్వర్లు

అలా అనడం ధర్మం కాదు. ఇక్కడ వైద్యలోపం ఏమీ జరుగ లేదు. శాయశక్తులా తంటాలు పడు తున్నాం. వైద్యుడు చెప్పిన మాటలను పుచ్చుకుని నీకూ మీ వాళ్ళకూ కూడా వ్రాస్తూ ఉన్నాం. దూరాన్ని ఉన్నావు. నీవు అధైర్య పడ తావేమో, అని, మీ అత్తగారు అంటున్నా, ఉన్నస్థితి ఎప్పటి కప్పుడు నీకు తెలియపర్చ మని చెప్పాను. ఇంతకూ హఠాత్తుగా ఇలా ముంచుకొచ్చింది. ఇలాటివి మనతోటి చెప్పి వస్తాయా—

సుకుమార్

ఆ డాక్టరు వట్టి మతిలేనివాడు అయి ఉండాలి! ఇన్నాళ్ళు ఇలా మీరబెట్టి, ఊరు కుంటాడా! తనకు అంతు పట్టకపోతే, మొదటనే చెప్పి అఘోరించవలసింది!

వెంకటేశ్వర్లు

తొందర పడకు బాబూ!

సుకుమార్

తొందరేమి టండీ ? వీళ్ళదగ్గ రుండే తెగులే ఇది. చేత కాదని చెప్పడానికి వెధవ పౌరుషం! ప్రాణం అంటేవమ్మిడీ ఎత్తు లక్ష్యంలేదు.

వెంకటేశ్వర్లు

లక్ష్యంలేకేమి నాయనా! ఉన్నది. ఉన్నది కనుకనే రాత్రనక పగలనక, ఎండనక వానసక. మనం రమ్మన్నప్పు డల్లా వచ్చి నిద్రహారాలు మానుకుని అవస్థ పడుతున్నాడు. వాళ్ళుమట్టుకు సుఖపడలేక నా! కాని మానవ విజ్ఞానం, ప్రజ్ఞా పరిమితము లన్నమాట మరచి పోకూడదు. వాళ్ళకు తెలిసి నంతవరకూ ఏలోటూ చెయ్యరు. వాళ్ళ బుద్ధి కతీతమైన దానికేం చేస్తారు. అందుకనే, అయన న్యాయంగా ఇప్పుడేనా తనకిదంతా అయోమయంగా ఉన్నదనీ, తనవల్ల కాదనీ చెప్పాడు.

సుకుమార్

ఈస్థితికి వచ్చిన తరువాత చెప్పేం, చెప్పకేం ?

వెంకటేశ్వర్లు

నాకు తోచినపని ఒకటిచేశాను. ఈవూళ్ళో ఒకవిచిత్రమైన వ్యక్తి ఉన్నాడు. అతను ఒక విధమైన అయుర్వేద వైద్యుడు. మామూలు పద్ధతిలోవాడు కాడు. జన సామాన్యానికి అతని మీద విశ్వాసం తక్కువ. కాని నాకుమట్టుకు ఏదో కొంతగురి ఉండి అతనికి కబురు పంపించాను. వస్తాడనుకుంటాను, ఏమి చెవుతాడో చూద్దాం. అంతకంటె మనం చెయ్యతగ్గ దేమీ కనుపించదు.

సుకుమార్

కదపడాని కేనా వీలు లేవాయెను మనిషని.

మంగమ్మ

ఎవరెన్ని చెప్పినా సరేకాని, ఇది వంట పుట్టిన జబ్బు కాదు. ఏ వైద్యుడికి లొంగేది కాదు.

సుకుమార్

(కొంచెం వెటకారంగా) అలాగా – పాపం ఆసంగతి తెలిసుండి, ఇంతకాలం ఎందుకు వైద్యం చేయించారు?

మంగమ్మ

ఊరుకోలేక. అయినా ఆడదాన్ని, దిక్కుమాలినదాన్ని: నా మాట వినేవా రెవరు? చేసేవా రెవరు?

సుకుమార్

అదేమిటి, మీఇంట్లో మీమాటవినని వారెవరుంటారు?

మంగమ్మ

అంత అదృష్టమా అని—ఎవరిదాకానో ఎందుకు నాయనా, నువ్వు విన్నావా ఏమిటి?

సుకుమార్

ఓహో! నామీదనే పడ్డదా! ఏమి! నేనెప్పుడు వినలేదు మీ మాట? మీ అమ్మాయిని ఎప్పుడు పంపమంటే అప్పుడు పంపి, ఎన్నాళ్ళుంచ మంటే అన్నాళ్ళూ ఉంచి, మీ ఇంటి చుట్టూ తిరుగుతున్నందుకా ఇది?

మంగమ్మ

నీ పెళ్ళాంకోసం నువ్వు తిరగడం ఎవరికి ఉద్ధరింపు!

దానికేం కాని—పిల్లకి మొక్కుంది నాయనా! అది తీరిస్తేనే కాని దానికి సుఖంగా ఉండదని ఎన్నివిధాల మొత్తుకున్నా విన్నావా? నామాట గడ్డి పరక కిందకట్టి పారేశావు? ఇప్పుడు ముంచుకొచ్చింది!

సుకుమార్

ఒహెూ! అదా సంగతి!

మంగమ్మ

అవును, అదే సంగతి. కుర్రదానికి రోగం లేదు, రొచ్చూ లేదు. ఆ ఏడుకొండలవాడు బాకీ వసూలుచేసుకోడాని కొచ్చాడు. ఇది రోగం కాదు, కనుకనే దాని ముక్కూమూలం ఎవ్వరికీ దొరకడం లేదు.

సుకుమార్

మీకుమట్టుకు దొరికింది పాపం. అయితే దానికి తగ్గ చికిత్స ఏదో మీరే చెయ్యకపోయారా, ఇంతడబ్బు ఖర్చుపెట్టి వైద్యం చేయించక పోతేను?

మంగమ్మ

నాచేతులో ఉన్నపనైతే అప్పుడే చేసేవాన్ని.

సుకుమార్

మీచేతిలో కాకపోతే ఇంకెవరి చేతులో ఉంది? రోగ నిదానం తెలిసినవారికి చికిత్స తెలియకపోతుందా?

వెంకటేశ్వర్లు

తెలియకేం—తెలుసును. అదే ఆవిడ చెపుతున్నది, నువ్వు వచ్చేసరికి

సుకుమార్

అలాగా!

వెంకటేశ్వర్లు

శ్రీ వెంకటేశ్వర స్వామి మా ఇలవేల్పు. అందుకనే నాపేరు వెంకటేశ్వర్లు అని పెట్టారు మావాళ్లు. నీ వివాహం ముందు మిమ్ముల నుభయులనూ వివాహం కాగానే తిరుపతి తీసుకు వెడతానని మొక్కుకున్నదట. అందుకు నీవు అంగీకరించని కారణంచేత ఆ మొక్కు చెల్లలేదు. అపైన నీ కార్యంముందు పిల్లకు చాలా జబ్బుచేసిన సంగతి నీకు జ్ఞాపక ముండే ఉంటుంది, అప్పుడు మళ్ళీ మొక్కుకుంది, ఇదివరకు మొక్కు చెల్లించని అపరాధంకింద ఈసారి పిల్ల వస్తువులు నిలువుదోపు ఇస్తానని. దానికీ నీవు అంగీకరించలేదట. ఈ రెండు మొక్కులూ చెల్లించని కారణంచేత స్వామి కిప్పుడు ఆగ్రహం వచ్చిందనీ, ఆ కారణంచేత ఇంతజబ్బు చేసిందనీ ఆమె నమ్మకం.

సుకుమార్

అలాగా!

వెంకటేశ్వర్లు

ఆవిడ నమ్మకమేకాదు. స్వామి ఆమెకు స్వప్నంలో కనపడి చెప్పాడట. పైగా వేణికూడ ఇమ్మన్నాడట.

సుకుమార్

ఇచ్చుకో మనండి. ఆవిడ ఏమి ఇచ్చుకుంటే మట్టుకు నా అభ్యంతరమే ముంది?

మంగమ్మ

బాగానే ఉంది. నీవేళాకోళాలూనువ్వూను! ఈవేళాకోళాల తోనూ వెక్కిరింపులతోనూ ఇంతవరకు తెచ్చావు. నేనిచ్చేదైతే నీ సెలవెందుకు? ఆయోగం ఈ జన్మకింక లేదు. ఏ అర్ధణా డబ్బులతోనో నా ఇబ్బంది తీరిపోతుంది.

సుకుమార్

వేళాకోళ మేమిటి? మిమ్మల్ని అడిగాడంటే మీ దేమో ననుకున్నాను. మీది కాకపోతే నాదా ఏమిటీ కొంపతీసి!

మంగమ్మ

నీదీకాదు, నాదీకాదు. పిల్లది. పాపం, ఏమీ ఎరగదు.

సుకుమార్

ఓహో! ఇదొకటి నిశ్చయించారన్న మాట.

వెంకటేశ్వర్లు

ఏమీ నిశ్చయించలేదు. ఆవిడ విశ్వాసమది.

సుకుమార్

ఇలాటి మూఢ విశ్వాసాలు పెట్టుకునేరోగం అలా ముదర పెట్టారు.

వెంకటేశ్వర్లు

సుప్తలా అనడం న్యాయంకాదు. ముందు మా పిల్ల, తరు వాత నీ భార్యాను. అందుచేత దాని ఆరోగ్య విషయంలో నీకున్నంత బాధ్యత మాకూ ఉంది. దానికి నలత ప్రారంభించి నప్పటినుంచీ వైద్యం చేయిస్తూనే ఉన్నాం. ఈమధ్యనే మీ అత్తగారికి ఈ అనుమానం కలిగింది.

మంగమ్మ

ఇలా అనిపోతాడనే అన్నిటికీ నోరు మూసు కూరుకున్నాను.

సుకుమార్

నే నన్నానని కోపమే కాని ఈ కాలంలో ఇంకా తిరుపతి వెంకటేశ్వర్లూ, మొక్కులూ ఏమిటండీ!

వెంకటేశ్వర్లు

ఈకాల మేమిటి, ఆకాల మేమిటి? దేవుడు అన్ని కాలాల వాడూను.

సుకుమార్

నేను దేవుడు సంగతికాదు చెప్పేది. ఆ వెంకటేశ్వర్లు సంగతి.

(మంచంమీద రాజ్యం మూలుగు)

వెంకటేశ్వర్లు

మనవాళ్ళు కొందరు దేవుడుకే వెంకటేశ్వర్లని పేరు పెట్టారు.

సుకుమార్

హ-హహ్హ వెంకటేశ్వర్లు దేవుడే అయితే ఇలాప్రవర్తిం చడు.

(మళ్ళీ రాజ్యం మూలుగుతుంది).

మంగమ్మ

మనం ఎంత తెలివైన వాళ్ళమైనా దైవనింద కూడదు. ఆ పరుషవాక్కులు చెవిని పడగానే బాధ ఎక్కువవుతోంది బిడ్డకు.

Rubbish.

వెంకటేశ్వర్లు

ఆయన ప్రవర్తనలో ఏమిటి లోటుకనిపెట్టావు ?

సుకుమార్

అంతాలోటే! ఈయనగారు, I mean this Tirupati fellow - తను దేవుణ్ణిఅనీ, తన దర్శనం జేసుకొని ముడుపు చెల్లించుకుంటే రోగాలూ రొచ్చులూనయం చెయ్యగలననీ, కష్టాలూ నష్టాలూ రాకుండా చెయ్యగలననీ. అలా తన దగ్గరకు రాకపోతే అనేక ఇబ్బందులు కల్పించగలననీ పంచమ దళంచేత బోలెడంత ప్రచారం చేయిస్తున్నాడు. ఇంతకంటె better advertised person కాని Goods కాని దేశంలో కనపడలేదు. మన మందమతులు అదంతా నిజం అనుకోడం, కాస్త తలనొప్పి వచ్చేనరికి తుర్రునతిరుపతి బయలుదేరడం, ఉన్నలొడ్డూ లొసుకూ అక్కడర్పించి మరింత దరిద్రం అనుభవించడమూను. How ridiculous ! ఇటువంటి మూఢ విశ్వాసాలు పోతేనే కాని దేశం బాగుపడదు.

మంగమ్మ

ఆవేం లేకుండా మీరు దేశాన్ని ఏమాత్రం ఉద్ధరిస్తున్నదీ చూస్తున్నాంకాదూ !

వెంకటేశ్వర్లు

దేవుడున్నాడనే నమ్మకం, ఆయనమీద విశ్వాసం ఉండడం మూర్ఖతంటావా ?

సుకుమార్

నా ఉద్దేశం అదికాదు తాతగారూ; దేవుడిమీద నమ్మకం ఉండకూడదని కాదు. ఈ చట్టు రాళ్ళే దేవుళ్ళనవద్దని నాగోల.

వెంకటేశ్వర్లు

నాయనా! యద్భావం తద్భవతి. రాయిఅయితేనేం, రప్పయితే నేం, ఏదైతేనేం? నమ్మకం ఉన్నవాడికి అణువు మొదలు బ్రహ్మాండంవరకూ సమస్తం ఈశ్వరమయమే!

సుకుమార్

కావచ్చు. అది వేరేసంగతి. అమహత్తరమైన భావం, సర్వ సమత్వం, మరచిపోయి కనపడ్డప్రతిసల్లరాయీ ఇటుకబొంతా దేవుళ్ళని, వాట్లకు బోలెడంత డబ్బు తగలేసి దేవాలయాలు నిర్మించి, మొక్కుబళ్ళనీ, ఉత్సవాలనీ, ఊరేగింపులనీ ఇంకా ఉన్నది ఊడ్చి, దేశం దిబ్బ చెయ్యడం ధర్మమా! ఈడబ్బంతా ఉంటే ఎన్నెన్ని ఆస్పత్రులు కట్టవచ్చు. ఎన్నెన్ని యంత్రశాలలు నిర్మించవచ్చు; ఎంతమంది బీద సాదలను రక్షించవచ్చు ఈవిగ్రహాలూ ఈదేవాలయాలతో విశాలం, విశ్వాతీతం కావలసిన మానవదృష్టి నంకుచితంచేసి, నమస్తకార్యములూ వీటివల్లనే సిద్ధిస్త వనినమ్మించి జనసామాన్యాన్ని మూర్ఖులనూ, క్రియా శూన్యులనూ చేస్తున్నారు మన పెద్దలు.

వెంకటేశ్వర్లు

నువ్వు చెప్పింది నిజమే, కాదనను. నీ నంఘసేవ కూడా ఈశ్వరారాధనే. ఇదో మోస్తరు విగ్రహారాధన, శరీరబాధ

నివారించడానికి అస్పత్రులు ఎంత అవసరమో భవబాధ నివారించడానికి దేవాలయాలు అంత అవసరమూను.

సుకుమార్

అలా అని ఊరికే మనం ఊహిస్తున్నాం.

వెంకటేశ్వర్లు

ప్రతివాళ్ళూ గాలిలో ఎగరలేరు కాదూ. నేలమీద నడిచే వాళ్ళకు నేల ఆసరా లేకపోతే ఎలాగా? ఏదో ఒక ఆధారం కావలెననుకున్నంత మాత్రంచేత వాళ్ళదృష్టి సంకుచిత మవుతుందో కాదో చెప్పలేను. కాని వాళ్ళ జీవితంమట్టుకు కొంత శూన్యంగా ఉంటుంది, మీయునకు లందరికీ దేశాన్ని ఉద్ధరిద్దామనే ఉత్సాహమే కాని, అకార్యం ఏరీతిగా చెయ్యవలెనో, ఏమి అవసరమో తెలుసుకునే ఓపికలేదు.

సుకుమార్

మమ్మల్ని వృధాగా నిందించడమేకాని మా ఆశయాలేమిటో తెలుసుకునే ఉదార హృదయాలు మీకూ లేవు.

వెంకటేశ్వర్లు

ప్రజల విగ్రహాలను బద్దలు కొట్టి, వాళ్ళ అర్చనలకూ ఆరాధనలకూ అవకాశం లేకుండా చెయ్యవలెననే ఉత్సాహం లోనూ ఉద్రేకంలోనూ వాళ్ళ విశ్వాసాన్నీ బుద్ధినీ నాశనం చేస్తున్నారు. ఇప్పుడున్న ఇల్లు బాగా లేక బద్దలు కొట్టవలె నంటే, వేరేఇల్లు చూపించి మరీ ఇది పాడుచెయ్యాలి, కాని ముందిది నిర్మూలనంచేసి ఇంట్లో ఉన్నవాళ్ళను నిరాధారంగా వీధుల్లోకి తోస్తే ఎలాగ? ఇంతకూ మీకు చేతనయింది నిర్మూలనమే కాని సృష్టికాదు. మీరు నేర్చినవిద్య అంతటిదే. ఒకమాట నాకుతోచింది చెపుతాను. ఈ నిర్గుణారాధననీ,

విశాలదృష్టి అనీ పెద్ద కబుర్లు చెప్పేవాళ్ళు చాలామంది, నీకు కోపం వచ్చినా సరే, కాని ప్రచ్ఛన్న నాస్తికులనినా నమ్మకం. పొరపాటు- నాస్తికులుకూడా కాదు, యదార్థంగానాస్తికులైనా కొంతనయమే. ఏమీకాకుండాదైవ చింతే లేకుండా ఉన్నారు.

మంగమ్మ

మాబాగా అన్నావు. వాళ్ళ పోకు లేమిటో వాళ్ల వేషా లేమిటో అంతేనే కాని. దేవుడూ అక్కర్లేదు దెయ్యమూ అక్కర్లేదు వాళ్లకి.

సుకుమార్

పొరపాటు, చాలా పొరపాటు! ఒకవేళ మీ రన్నదే నిజ మనుకున్నా మీ మూఢభక్తికంటే తెలివైన నాస్తికతేమంచిది.

(మంచంమీద మూలుగు)

మంగమ్మ

ఇప్పుడీ దిక్కుమాలిన తర్కం ఏమిటి నాన్నా పిల్లసంగతి చూడక?

వెంకటేశ్వర్లు

ఎంతటి తెలివితేట లయినా, విశ్వాసంతోటీ, భక్తితోటీ సమానంకావు నాయనా! ఇప్పుడు నాకూ విగ్రహారాధనంటే ఇష్టంలేదు. మూఢభక్తి నాకూ ఇష్టంలేదు. కాని ప్రజాసామాన్యానికి ఏ రాయో, రప్పో, గుడ్డో, కుంటో, వాళ్లదేవుళ్ళు వాళ్లకుండొద్దూ? చిన్న పిల్లలు చూశావు—ఎంత వరిద్రులైనా, పగిలిపోయినదో, విరిగిపోయినదో అఖరుకు ఒక తాటాకు ముక్కో, పెంకుముక్కో, బొమ్మని అనుకుంటేనేకాని వాళ్లకు కాలక్షేపం కాదు. వయస్సులోఎంత పెద్దవాళ్లమైనా సృష్టి పరిణామంలో మనం అంతా చంటిపిల్లలమే కాదూ!

సుకుమార్

ఆయితే వాళ్లకు ఎదుగు బొదుగులుండవా? అక్కర్లేదా?

వెంకటేశ్వర్లు

కాసూ కావాలి. ఎవగనూ ఎదుగుతారు. కాని అంత వదకూ వాళ్లబుద్ధి వికాసం పొంది, ఈశ్వరుని నిర్గుణ, నిరా కార, నిర్వికార, సర్వాంతర్యామిత్వం పూర్తిగా అవగాహన చేసుకొని, అనుభవంలోకి తెచ్చుకో కలిగేదాగా వాళ్ల విశ్వా సాలూ వాళ్ళ నమ్మకాలూ వాళ్ళ కుండనియ్యి. దానివల్ల వాళ్లకు కాని, దేశానికి కాని, వచ్చిన ముప్పేమీలేదు. భక్తి విశ్వాసాలు క్రియాశక్తికి పూర్వరూపాలు. పరిపూర్ణమైన భక్తి ఇచ్ఛాశక్తిని సవ్యమైన మార్గంలో నడిపించి, క్రియా శక్తిగా పరిణమింప చేస్తుంది. అందుచేత నీ భక్తివల్ల ప్రజ లకు కలిగే కాస్త ఆనందంకూడా లేకుండాచేసి వాళ్లనంధ కారంలో పడేస్తా ననడం ధర్మమా—

సుకుమార్

అంధకారంలో ఏమీ పడెయ్యడం లేదు. వాళ్ళ శాశ్వత మనుకుని చలనం లేకుండా ఎదుగుబొదుగులు లేకుండా కూర్చున్న వాళ్ళకు కొంత పని కల్పించానన్నమాట. వాళ్ళ తెలివితేట లుపయోగించి, అసలు వస్తువును తెలుసుకోడానికి ప్రయత్నిస్తారు.

వెంకటేశ్వర్లు

నే ననేది అంతవరకూను. వాళ్ళను నిరాధారంగా విడిచి పెట్టడం చాలా ప్రమాదం.

సుకుమార్

ఏమీ ప్రమాదం లేదు. మనం భ్రమ పడ్డమే ప్రమాదం.

వెంకటేశ్వర్లు

నాయనా! అనేక శతాబ్దాలనుంచి ప్రజలు కష్టంలోనూ, నిరాశలోనూ, నిస్పృహలోనూ ఏమీ తోచక, ఏమీ చెయ్యలేక దైవ సన్నిధనే పరిపూర్ణ విశ్వాసంతో, భక్తితో, ఈ దేవాలయాలకు వచ్చి అక్కడ స్వామిసన్నిధిని, వాళ్ళ ఆశలూ, ఆశయాలూ ప్రార్ధనలూ వెళ్ళపోసుకుని కొంతమనశ్శాంతితో వెళ్ళిపోయారు. ఆ మనుష్యులు పోయినా; ఆ దేవాలయాలూ ఆ దేవుళ్ళూ మిగిలారు. ఆ ప్రార్ధనలూ ఆ మంత్రాలూ వాయు తరంగాలలో లీనమై అక్కడ శాశ్వతంగా ఉండిపోయి, తరువాత తరాల వాళ్ళకు సహాయ పడుతున్నాయి. వాళ్ళ ఈ ఆశాలత కాస్తా ఎందుకు తెంపుతానంటావు నాయనా! వాళ్ళకు తగిన విద్యనేర్పి బుద్ధివికాసం కలిగించవలెనే కాని కేవలం నిర్మూలనంవల్ల ఏ పనీ జరగదు బాబూ!

మంగమ్మ

అయ్యో—ముంచుకొస్తోంది. పిల్లమాటేమిటి నాన్న?

సుకుమార్

జరక్కేం చేస్తుంది? మహచక్కగా జరుగుతుంది. ఈ పాతవిశ్వాసాలూ సమ్మకాలూ పునాదులతో పెళ్ళగించి పార వేస్తేనే కాని పునర్నిర్మాణం పునస్సృష్టి చెయ్యడానికి వీలుండదు. ఈ తిరుపతి అయిన ఉన్నాడే ఈలాటివాళ్ళు అంతా పోవాలి

మంగమ్మ

అః అః హరి హరీ! (అని చెవులు మూసుకుంటుంది.)

(బయట పెద్ద ఉరుములు చప్పుడు మంచంమీదనుంచి వెర్రికేక. అందరూ మంచందగ్గరకు పరుగెడతారు.)

మంగమ్మ

అయ్యో, నాతల్లోయి! ఇంకేముందోయి దేవుడా! (అని రోదన).

సుకుమార్

రాజ్యం నా రాజ్యం! (అని ఏడుపు)

వెంకటేశ్వర్లు

తొందర పడకండి, భయంలేదు, ఏమిటి, హఠాత్తుగా గదంతా ఇలా చల్లపడి పోయిందేం—

(ఆ మాటలో ఆయుర్వేద వైద్యు డొస్తాడు)

వెంకటేశ్వర్లు

ఎవరు వారు?

వైద్యుడు

నేను చంద్రశేఖరాన్నండీ. తమరు రమ్మన్నారంటే.

వెంకటేశ్వర్లు

రండిబాబూ నమయానికి దేవుడులా వచ్చారు. ముందు అమ్మాయిని చూడండి.

చంద్రశేఖరం

(అమ్మాయిని పరీక్ష చేస్తాడు) అయ్యా, మీరేమీ అనుకోకుండా ఉంటే ఒక్క సంగతి మనవిచేస్తాను. ఈ అమ్మాయికి శారీరకమైన రుగ్మత ఏమీ కనుపించదు.

మంగమ్మ

ఆ అలాగాండి—

సుకుమార్

మరైతే ఏమంటారు?

చంద్రశేఖరం

మీకు నమ్మక ముండదేమోనని సందేహిస్తున్నాను.

మంగమ్మ

మాకు నమ్మకం లేకపోవడ మేమి టండీ?

సుకుమార్

అయినా చెప్పండి.

వెంకటేశ్వర్లు

పరవాలేదు. మీ రేమీ సందేహించ నక్కరలేదు చెప్పండి.

చంద్రశేఖరం

ఈపిల్ల నేదో దేవతో, దెయ్యమో ఆవహించింది. అది వదలి పోతే పిల్ల నిక్షేపంలా ఉంటుంది.

మంగమ్మ

అదుగో విన్నారా, నీ అమ్మకడుపు చల్లగా, ఉన్నమాట చెప్పావు తండ్రీ-

సుకుమార్

చెయ్యిచూస్తే ఎలా తెలిసిందండి? ఇదేదో—

(పైన పెద్ద ఉరుములూ మెరుపులూనూ)

చంద్రశేఖరం

అయ్యా, మీకు చిన్నతనం ఇప్పుడు తెలియదులెండి. వారు పెద్దలు అవిగారు, గనక వారియందుండే గౌరవముకొద్దీ నా అభిప్రాయం చెప్పాను కాని మరొకళ్లు రమ్మంటే రాను— మాట్లాడను.

వెంకటేశ్వర్లు

మా అమ్మాయి అభిప్రాయంకూడా అదేనండీ – శ్రీ వెంకటేశ్వర స్వామి ఆవహించాడని..

సుకుమార్

I don't believe it ఇదంతా ఆవిడపన్నిన పన్నాగం

చంద్రశేఖరం

అయ్యో! తొందర పడకండి. మనం మృత్యుసన్నిధిలో ఉన్నాం. మన నమ్మకాలూ తెలివి తేటలూ ఏమీ పని చెయ్యవు,

వెంకటేశ్వర్లు

ఎవరు వారు ?

చంద్రశేఖరం

క్రొత్తవా రెవరూ రాలేదండీ—

వెంకటేశ్వర్లు

అయ్యో. రాకపోవడ మేమిటి? మరి వారంతా ఎవరు ? ఎవ్వరూ రాలేదా. గదంతా జనంతో నిండి పోయినటుంది. హఠాత్తుగా గదంతా ఇంత చల్లపడి పోయింది. చంద్రశేఖరం గారూ, తరుణం సమీపించిన ట్లుంది.

చంద్రశేఖరం

చిత్తం-వ్యవధి లేదు. నిమిషాలలోకి వచ్చింది పిల్ల దక్కవలెనంటే, మీ మ్రొక్కుబడు లేమైనా ఉంటే వెంటనే చెల్లించుకుంటా మని మళ్లీ మ్రొక్కుకోండి. ఆ స్వామి అనుగ్రహముంటే ఈబిడ్డ జీవించాలి, కాని మానవమాత్రుడేమీ చెయ్య లేడు. సెలవు. (అని వెళ్లి పోతాడు)

(వెంక టేశ్వర్లుగారు తలవంచుకుని సమస్కరిస్తూ కూచుంటాడు. పైన పెద్ద ఉరుముల చప్పుడు, మంచంమీద పెద్ద కేక.)

వెం॥ టేశ్వర్లు

అయ్యో, పిల్లరోయ్ ;

మంగమ్మ

అయ్యో, నాతల్లోయి! ఇంకే ముందోయి—నాబిడ్డ గొంతుక చేతులారా కోసుకున్నానోయి! నాతండ్రీ—వెంకటాచలపతి! ఇంతవరకూ) తెచ్చావు నాయనా—ఇంక నాగతేమిటి తండ్రీ-అని ఏడుస్తూ గదిలోనుంచి పరుగెత్తు కెడుతుంది.)

సుకుమార్

అయ్యయ్యో రాజ్యంసన్ను విడచిపోతావా! రాజ్యం మాట్లాడవూ—ఒక్కసారి చూడవూ, రాజ్యం — రాజ్యం — నాగతేమిటి! రాజ్యం!

(అని వెక్కి వెక్కి ఏడుస్తుండగా లోపల గణగణగంటవినబడుతుంది.)

అయ్యో, పరమేశ్వరా, దయామయా, వెంకటేశ్వర స్వామీ, నా అపరాధం మన్నించు తండ్రీ! నా రాజ్యాన్ని రక్షించు స్వామీ - నీదివ్య దర్శనం చేసుకుని నీకు నిలువు దోపూ, వేణీ, అర్పించుకుంటాం స్వామీ-అయ్యో, రాజ్యం -

(అని ఏడుస్తుండగా లోపలనుంచి మంగమ్మగారు తడిబట్టలతో హారతి తీసుకొచ్చి రాజ్యం కళ్ళకూ వొంటికీ అద్దుతుంది. క్షణంలో రాజ్యం పెద్ద నిట్టూర్పు విడుస్తుంది. తల్లీ మొగుడూ అమ్మాయి కే సిచూస్తారు. నెమ్మదిగా కళ్లు తెరుస్తుంది. ఇటూ అటూ చూచి దాహం అని సంజ్ఞ చేస్తుంది.)

మంగమ్మ

నాతల్లి బతికింది! తండ్రీ, రక్షించావు నాయనా—

వెంకటేశ్వర్లు

అ - అలాగా అందుకనే గది మళ్ళీ నిర్జనమై, అపల్లవసం పోయింది—వెంకటేశ్వరస్వామి అనుగ్రహం ఉంటే లోటే మిటి—(నెమ్మదిగా కాసిని పాలు పోస్తారు, ఆమె భర్తకేసి చూచి చెయ్యి చాచి వచ్చారా! అంటుంది.)

సుకుమార్

రాజ్యం! (అని ఆమె చెయ్యి పట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ చెయ్యిముద్దు పెట్టుకుంటాడు. రాజ్యం నెమ్మదిగా అతని తలనిమురుతుంది. వెంకటేశ్వర్లుగారు వెంకటేశ్వర స్తుతి చేస్తారు.)

త్వత్పాదధూళి భరితస్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గనిరపేక్ష నిజాంతరంగాః
కల్పాగమాకలనయా ౨౨ కులతాంలభంతే
శ్రీవేంకటాచలపతే తవసు ప్రభాతమ్॥

# అభ్యుదయం

## పాత్రలు

| | |
|---|---|
| నారాయణరావు | విజ్ఞానవేత్త |
| శేఖర్ | శిష్యుడు |
| పద్మావతి (వితంతువు) | నారాయణరావు |

కాలం - ఉదయం

(నారాయణ రావు స్వతస విజ్ఞాన ప్రయోగ కేంద్రంలో (Experimenped Iaboratory) తీవ్రంగా ప్రయోగం చేస్తూ ఉంటాడు. అప్పుడు నారాయణరావు ప్రవేశిస్తాడు.)

శేఖర్

నమస్కారం సార్

(అంటూ కోటు చేతిమీద వేసుకొని వస్తాడు.)

నారాయణరావు

ఒకసారి తలఎత్తి, పరధ్యానంగా చూచి, మళ్ళీ తనపని చూచుకొంటాడు)

శేఖర్

తమరింకా ఇక్కడే ఉన్నారేమండి ?

నారాయణరావు

............

శేఖర్

అయ్యా :

నారాయణరావు

............

శేఖర్

సార్... ...సార్

నారాయణరావు

(తలెత్తి) ఓహో శేఖరా, ఎంతసేపైందోయి వచ్చి ?

శేఖర్

తమరు...

నారాయణరావు

ప్యూన్

(ప్రవేశం బంట్రోతు)

బంట్రోతు

సార్

నారాయణరావు

ఏం – ఏమిటి -

బంట్రోతు

తమరు పిలిచారండి సార్

నారాయణరావు

ఆఁ పిలిచానా (క్షణం ఆలోచించి) ఏమో ఎందుకో-సరే వెళ్లు

బంట్రోతు

చిత్తం (పోవును)

నారాయణరావు

కూచో-అన్నట్టు నిన్నటి టెస్టు ఏమయిందో చూచావా ?

శేఖర్

• లేదు కానండి... తమరు రైలుకు........

నారాయణరావు

నారాయణరావు

ఏమోయి ఈవాళ నాకు బ్రహ్మానందంగా ఉంది, నాజీవితాశయం నేటికి చేకూరింది.

శేఖర్

ఈవాళ తమరు

నారాయణరావు

అఁ-ఏమిటి ?

ఈపూట తమరు మెయిలు దగ్గిరికి వెళ్ళవలెనని అన్నారు కదూ

నారాయణరావు

మెయిలు దగ్గరికా: ఎందుకు ?

శేఖర్

మరచిపోయారా ఏమిటి - తమ అక్కగారు వస్తారనీ, వారిని రైలుదగ్గర కలుసుకోవాలనీ అన్నారు

నారాయణరావు

అవునుసుమా, మరచిపోయాను. ఎవర్రా అక్కడ ( బెల్ మ్రోగిస్తాడు)

(ప్రవేశం బంట్రోతు)

నారాయణరావు

త్వరగా కారుతియ్యమను. మెయిలు వేళకు నన్ను పిలవ మని నీతో చెప్పలేదూ ? ఎందుకు పిలిచావు కావు ? మని షివి కావూ—అంత మందమ......

బంట్రోతు

చిత్తంబాబూ, పిలిచానండి. ఎన్నిసార్లు పిలిచినా తమరు వినిపించుకోలేదండి. వేళ మించి పోతోందని కారు మెయిలు వద్దకు పంపించానండి.

నారాయణరావు

ఓహో : అలాగా : అయితే సరే. వెళ్లు. పాపం : మా

అక్కయ్య చాలా కష్టంలోకూడా ఉంది. రైలుదగ్గరకేనా రాలేదనుకుంటుందేమో: అసలు వాళ్ళవూరే వెళ్ళిచూచి, నాతోకూడా తీసుకొద్దామనుకున్నాను; కాని యీ దిక్కుమాలిన ఎక్స్పెరిమెంటు ఎన్నాళ్ళకూ తెమలక ప్రాణాలుతీసేసింది. ఆవిడ ఏమనుకుంటుందో ఏమిటో.

శేఖర్

అలాగేనండి. ఆడవాళ్ళకు ఇటువంటి విషయాలలో పట్టుదల ఎక్కువ.

నారాయణరావు

నిజమే. వాళ్ళకి సంతోషమూ, దుఃఖమూకూడా ఇంకొకళ్ళతో పంచుకుంటేనే కాని తృప్తి ఉండదు. మా అక్కయ్యకు మట్టుకు పాపం చాలా గొప్ప కష్టమే వచ్చింది. నాలుగు మాసాలలోపున ఆవిడ భర్తా, ఇద్దరు కుమారులూ, యుద్ధంలో చనిపోయినారు: ఏమి చెయ్యం యుద్ధాలూ తప్పవు. వాటిలో మనుష్యులు చావడమూ తప్పదు. మధ్య మధ్య ఇటువంటి ప్రళయం ఏదోవచ్చి భూభారం కొంత తగ్గుతూ ఉంటుంది.

శేఖర్

దానికి మనమున్ను శాయశక్తులా తంటాలుపడి సహాయం చేస్తున్నాం. ఎంతఘోరం....

నారాయణరావు

ఘోరమేమిటోయ్ వెర్రివాడా. ఇటువంటి తప్పువారిని పడకు. మనంకాకపోతే మరొకడు సాధిస్తాడీ కార్యం. ఇదివరకు చేసినవాళ్ళంతా చెయ్యలేదూ. అలాగే ముందు మరొకరు.

శేఖర్

ఏమోనండీ సార్. ఇదివరకు ఏమి చేశారో, ఇకముందు ఏమిచేస్తారో గానండి. మనం చేస్తూవున్నపని మట్టుకు మంచిది కాదనే సందేహం బాధిస్తోందండి.

నారాయణరావు

ఏమిటోయ్ - నువ్వొక Doubting Thomas వి బయలుదేరేవు మాకు. ఇటువంటి సందేహ మేమీ పెట్టుకోకు. "సంశయాత్మా వినశ్యతి" అన్నారు పెద్దలు.

శేఖర్

మీరెన్నయినా చెప్పండి. సైన్సు సాధించ వలసిన ప్రయోజన మిదికాదని తోస్తోంది.

నారాయణరావు

(వెటకారంగా) ఓహో: మరైతే ఏమంటావు?

శేఖర్

మన జీవితం సుఖప్రదం చేయడానికేగాని మరొకదానికి అధికారం లేదనుకొంటాను.

నారాయణరావు

ఏమి ఎందుకులేదు? ఒకదాని కధికారమున్నప్పుడు రెండవదానికీ ఉంటుంది. అంగఘాతములో చికిత్సకుడు దుష్టాంగాలు ఖండించి శేషాంగ శ్రేణిని రక్షించినట్లే మానవజాతిలో కొంతభాగం నిర్మూలం చేసినందువల్ల జాతిలోనూ, జాతి జీవనంలోనూ మార్పులు తీసుకొచ్చి ఉత్తమ మార్గానికి పోగలిగినప్పుడు తప్పక మనం సంహారానికి పూనుకో వచ్చుననే నా నమ్మకం.

(ప్రవేశం బంట్రోతు)

బంట్రోతు

అమ్మగారొచ్చారు బాబూ :

నారాయణరావు

అహఁ అలాగా: వస్తున్నాను. సామాను జాగ్రత్తగా లోపల పెట్టించు.

(ప్రవేశం పద్మావతి)

అమ్మా నమస్కారమండి దయచేయండి.

(కుర్చీ ముందుకు లాగుతాడు.)

నారాయణరావు

(ఉలిక్కిపడి తిరిగిచూచి) అక్కయ్యా: వచ్చావా, స్టేషనుకు వద్దామనుకున్నాను. నేనేదో పనితొందరలో ఉంటే నాతో చెప్పకుండానే కారు స్టేషనుకు తీసుకుపోయాడు. కారొచ్చిందా ?

పద్మావతి

వచ్చే వుంటుంది. నేను చూడలేదు. రాకపోతేమట్టుకు మునిగిపోయేదేముంది ? స్టేషనులో బళ్ళు లేవా ? ఇక్కడకు రాలేనా ? స్వతంత్రురాలను గూడా అయ్యానాయె ఈ మధ్య.

నారాయణరావు

(తొందరగా) అవునవును. శేఖర్, ఆ ఎక్స్పెరిమెంటు తరువాయి ఏమయిందో చూడమ్మా వెళ్ళి.

పద్మావతి

మీ బావగారుకూడా ఈ మధ్యను...

నారాయణరావు

విన్నాను. వెంటనే వద్దామనుకొన్నాను. ఈ పని తొందరగా తెమలక విడిచి రావడానికి వీలులేక - చాలాసార్లు అనుకున్నాను.

పద్మావతి

అనుకున్నావు - అంతేచాలు నాయనా – రాకపోతే మాత్ర మేమి? ఎవరువచ్చి మట్టుకు చేసేదేముంది? పోయిన వాళ్ళకోసం ఉన్నవాళ్ళు పనులు మానుకుంటారా ?

నారాయణరావు

ముఖ్యంగా ఈ పని వున్నదే, అక్కయ్యా, నువ్వు నమ్ముతావో నమ్మవో కాని ఒక్క క్షణం కూడా విడిచి పెట్టడానికి వీల్లేనిది. అందులోనూ ఈమధ్య బొత్తిగానే-నేను కడుపునిండా అన్నం తిని, కంటినిండా నిద్రపోయి నెలరోజులు పయిన అయిందంటే నమ్ము - 24 గంటలూ శవ జాగరణంలాగా దీన్ని కనిపెట్టుకొని కూర్చోడమే.

పద్మావతి

నమ్మక పోవడమేఖిటి నాయనా. నిన్ను చూస్తే తెలియడం లేదూ - ఈ శేఖర్ వాళ్ళూ ఉన్నారుకదూ నీకుసహాయానికి–

నారాయణరావు

ఉన్నారనుకో-తెలివైనవాళ్ళూ బుద్ధిమంతులూనూ-ఉన్నా ఒక్క శేఖర్‌నితప్ప తక్కినవాళ్ళ నెవ్వరినీ దీని దగ్గరకు రానియ్యటం లేదు. ఇదున్నదే - నేను చూస్తూన్న పని -

పూర్తి అయి గవర్నమెంటు చేతిలో పెటితేనే తప్ప రెండో కంటివాడికి తెలియకూడదు. రెండో కంటివాడేమిటి, అసలు నాకుకూడా తెలియదన్నమాట.

పద్మావతి

అలాగా నాయనా. నీ సైన్సు పనికీ గవర్న మెంటుకీ సంబంధమేముందీ?

నారాయణరావు

నేను ప్రజోపకారమైనదీ పరమ రహస్యమయినదీ మహత్కార్య మొకటి సాధిస్తున్నానని గవర్నమెంటు వారెలాగో తెలుసుకుని ఈ ప్రయత్నం తమకై వినియోగించ మన్నారు. నన్ను చాలా మహోన్నత పదవికితీసుకోస్తామని వాగ్దానం చేశారు -

పద్మావతి

అలాగా నాయనా - సంతోషం.

నారాయణరావు

పరరాజ్యపాలకుల వద్దనుంచి కూడా చాలామంది రాయబారులు వచ్చారు దీనికోసం. కాని నేను నాయీశక్తి మన దేశానికే వినియోగించాలని నిశ్చయించుకున్నాను.

పద్మావతి

బాగుంది, మంచిదే.

నారాయణరావు

ఈ సంగతి మనవాళ్ళు తెలుసుకొని నాకే ప్రమాదమూ

రాకుండా రహస్య రక్షకభటులనుకూడా మన యింటివద్ద ఏర్పాటుచేశారు.

పద్మావతి

ఆలాగా, అంత ప్రమాదించేదా : అయితే అది పూర్తి అయిందా.

నారాయణరావు

ఆహా, నిష్పటికి పూర్తి అయింది. అబ్బ : నాకు ఎంత సంతోషంగా ఉందనుకొన్నావు అక్కయ్యా :

పద్మావతి

కాదు నాయనా : అంతకష్టపడి చేసిన కృషి ఫలోన్ముఖానికి వచ్చిందంటే సంతోషంకాదూ :

నారాయణరావు

నా ప్రయత్నం ఇంకా ఫలానా అని నీకు తెలియదు. కాని నిజంగా, నిజంగా నాజన్మ తరించింది అనుకొంటున్నాను. నాతపస్సు - నాతపస్సేమిటి, నువ్వు అహంకారం అనుకొంటావేమోకాని - మన పూర్వులందరి తపస్సూ కూడా ఫలించిందని నా నమ్మకం. వారి అందరివిద్యా, మేధాశక్తీ నన్నావహించి మానవాతీతమైన శక్తినాకిచ్చి నాచేత ఈ మహత్తర కార్యం చేయించిందని నా నమ్మకం.

పద్మావతి

కావచ్చును.

నారాయణరావు

అనేక శతాబ్దాలనుంచి వైజ్ఞానికులూ, శాస్త్ర వేత్తలూ,

దేశాభిమానులూ కృషిచేసి విఫలమనోరథులై నిరాశతో,నిస్పృహతో దేనికైతే ప్రాణాలు ధారపోశారో దానినినేను సాధించాను ఊహల్లోనూ స్వప్నములలోనూ లీలగా గోచరించినదాన్ని మూర్తీభవింపజేసి వాస్తవిక జగత్తులో కార్యరంగంలోనికి తీసుకు రాగలిగాను. ఇంతకంటె ఏ మానవుడు మాత్రం ఏమి చేయగలడు ?

పద్మావతి

నిజమే, చాలా సంతోషమే, కాని నేనుఆడదాన్ని తెలియక అడుగుతున్నాను, నాయనా! ఇప్పుడు నీవు సాధించిన మహాకార్యమేమిటో?

నారాయణరావు

కానైతే పరమరహస్యమే కాని నీదగ్గర నాకు రహస్యమేముంది? పైగా అంతా పూర్తిఅయిపోయిందాయెను. సృష్ట్యాదినుంచీ మానవులలో ఎందుకో ఒకందుకు ఒకరితో ఒకరికి పోరు తప్పడంలేదు. అలాగే రాజ్యాలు ఏర్పడినప్పటినుంచీ ఏదో ఒక కారణం పురస్కరించుకొని యుద్ధాలు ఆరంభమయ్యాయి- యుద్ధమనేది లేకుండా చేయవలెనని కొంతకాలం నుంచి అనేకమంది పాటుపడుతున్నారు. కాని మానవజాతి ఉన్నంతవరకూ, వర్తకమూ, ధనార్జనమూ, మానవ జీవితములో ప్రాధాన్యత వహించినంతవరకూ యుద్ధములు తప్పవని అందరూ అంగీకరించారు. ఇక యుద్ధాలు లేకుండా చేయడమెలాగు?

పద్మావతి

దెబ్బలాడుకోవడం మానేసి పొత్తుగా ఉంటేసరి.

నారాయణరావు

ఏదో ఒకదేశం, ఒకజాతి అజేయమైతే యుద్ధము ఉండదు.

పద్మావతి

అదెలా సాధ్యమవుతుంది?

నారాయణరావు

తన కెక్కువ నష్టంలేకుండా, ఇతరదేశాలకు ఊహాతీత మైన ధనప్రాణ నష్టం కలిగించిన దేశం అజేయమన్న మాట ఈ ఉద్దేశంతోనే ఫిరంగులూ మరఫిరంగులూ యుద్ధనావలూ జలాంతర్గాములూ వాయువిమానాలూ బాంబులూ మొదలైన మారణయంత్రాలను కని పెట్టారు.

పద్మావతి

వీటితో యుద్ధాలు ఎక్కువ అవుతున్నాయి. కాని తగ్గడం లేదే :

నారాయణరావు

ఎందుచేతనంటే అవి అన్నీ అసంపూర్ణము లైనవే. ఏదే శానికీ పూర్తిఅయిన విజయాన్ని చేకూర్చలేకపోతున్నాయి.

పద్మావతి

అయితే ఇప్పుడు నీవాలోటు తీర్చానంటావా!

నారాయణరావు

అదే నేనిప్పుడు చెప్పబోయేది. నేనుకొన్ని సంవత్సరముల నుంచీ ప్రయత్నంచేసి మూడు ముఖ్యసాధనాలు కనిపెట్టేను. దీనితో నేలమీదను నీటిమీదను గాలిలోను శత్రువులు లేకుండా చేయవచ్చును. ఇదిగో ఇక్కడ ఉన్న చూర్ణాలు ఒక నిర్ణీత

మైన లెక్కలో కలిపి బాంబులోపెట్టి ఎక్కడన్నా పడేస్తే అది ప్రేలి దానినుంచిదారుణ మారణశక్తి బయలుదేరుతుంది. ఆ చుట్టుపట్ల ఇరవై ముప్పై మైళ్ళ దూరంలో ఉన్న జీవ కోటి యావత్తూ ఒక్క క్షణంలో మాడిపోతుంది.

పద్మావతి

ఆఁ. ఏమిటి? బాంబా? కొత్తరకం బాంబు కనిపెట్టావా? నువ్వా? నా తమ్ముడవు:

నారాయణరావు

ఈ ఆగ్నేయాస్త్రం ముందు ఏ సైన్యం నిలిచి యుద్ధం చేయగలదు? ఇంక మన్ని జయించే వాళ్లు సృష్టిలో ఉండరు. మనమీదికి యుద్ధానికి రావాలంటే దేవత లనేవాళ్ళుకూడా కొంచెం ముందువెనకలు ఆలోచించ వలసి ఉంటుంది.

పద్మావతి

నిజమే, చాలా గొప్పవిషయం కనిపెట్టావు.

నారాయణరావు

గొప్పవిషయం కాకేమి? ఇంతకంటె తనసంఘానికీ దేశానికీఎవరుమట్టుకు చెయ్యగలిగిందీ. చేసేదీ ఏముంది?మానవ జాతి నశించకుండా ఉండే తరుణోపాయం కనిపెట్టేనని నా నమ్మకం.

పద్మావతి

మానవజాతి నసించకుండా ఉండటానికా:(వికటంగానవ్వి) మానవజాతిని నిర్మూలంచేసే ఉపాయంకనిపెట్టావు. ఇంతటితో యుద్ధమాగి పోతుందేమిః? నిన్నుమించిన కుశాగ్రబుద్ధులు లోకంలో లేరేమి? వెర్రివాడా: పరమేశ్వరుడు సాక్షిగా చెబుతు

న్నాను. ఇది బయటపడ్డ తక్షణం ఉద్భ్రమించిన మారణతో పాయం కనిపెట్టేవాడు మరొకడు బయలుదేరి తీరుతాడు.

నారాయణరావు

పరమేశ్వరుడంటూ ఒకడు ఉంటేకదూ ఆయన సాక్ష్యానికి? అందుచేత భయములేదులే.

పద్మావతి

అలాగే నవ్వుదువుగాని: ఇదివరకు మారణయంత్రాలు కనిపెట్టిన వాళ్ళంతా యిలాగ భ్రమపడ్డవాళ్ళే.

నారాయణరావు

నీకు తెలియదులే. ఇదివరకు వాటికీ వీటికీ చాలా తేడావుంది.

పద్మావతి

వీళ్ళకు వీళ్ళపనేకాని మానవ సహజమైన దయ దాక్షిణ్యా లుండవనుకుంటాను.

నారాయణరావు

ఉండకేం. మనవాళ్ళు పోయారంటే నేను విచారించ లేదూ:

పద్మావతి

మనవాళ్ళెలా పోయారో విన్నావా?

నారాయణరావు

అప్పుడు పత్రికలో చదివాను. అఖండమైన ధైర్యంతో శత్రువుల నెదుర్కొని దారుణ యుద్ధంచేసి వీరస్వర్గం పొందా రనీ. మనవాళ్లు మన దేశానికీ మనకీ అద్వితీయమైన సేవ చేసి ఇంత ఖ్యాతిని సంపాదించారని చాలా గర్వ పడ్డాను.

పద్మావతి

అలాగనే నాకూ ఉత్తరం వచ్చింది. అదంతా నిజమే అనుకుని నా దుఃఖాన్ని దిగమింగుకొని నా నాయనలు వీర స్వర్గం పొందారని శాంతించాను.

నారాయణరావు

అయితే అదంతా నిజంకాదూ?

పద్మావతి

దారుణ యుద్ధంలేదు, వీరస్వర్గంలేదు, ఏవల్లకాడూ లేదు.

నారాయణరావు

మరైతే!

పద్మావతి

ఎక్కడో యుద్ధభూమిలో చలిలో కందకాలలో కొరడు బారిపోయి కూలబడి గర్భ నిర్భేద్యమైన ఫిరంగి మ్రోతలతో నిద్రాహారాలులేక బాధపడగా పడగా ఒకరోజున పైనుంచి ఒక బాంబు పడ్డదట. నాతండ్రులు ఉక్కు ముక్కల్లాంటి వాళ్ళు సహస్ర ఖండాలుగా సహస్ర ముఖాలుగా గాలిలో ఎగిరి పోయారట. అది వాళ్లు చేసిన దారుణ యుద్ధం.

నారాయణరావు

ఎంతఘోరం :

పద్మావతి

ఘోరమా మరీఘోరమా, నీమేనల్లుళ్ళు నాయనా, నీవంటే వాళ్ళకెంతో ప్రేమా భక్తి గౌరవమూను. నీ కెప్పుడో నోబెల్ ప్రైజు వస్తుందనీ అప్పుడు నీతోకూడా యూరపు చూడాలనీ అనుకుంటూ ఉండేవాళ్ళు.

నారాయణరావు

పాపం! ఇంకనువ్వు మరచిపోవాలనంతాను.

పద్మావతి

ఎలా మరచిపోను వాళ్ళను. ఒక్క శత్రుముఖమైనా చూడకుండా ముక్కలుముక్కలై పోయారు ఒక్కబాంబుతో. నువ్వు తయారుచేస్తున్న బాంబు లాంటివానితో రూపులేకుండా పోయారు నాయనా.

నారాయణరావు

అస్తమానం నువ్వు అలా విచారిస్తూ ఉండకూడదు. ఇవ తలమనవాడు ఒక్కడు పోయాడంటే అవతలవాళ్ళు వెయ్యి మంది చచ్చారన్నమాటే.

పద్మావతి

నాకేంలాభం బాబూ. ఈ జన్మలో నా బిడ్డలు నాకింక కనబడరుగదా! నాకుమల్లేనే ఎక్కడో ఏ తల్లులో అల్లారు ముద్దుగా కని పెంచుకున్న వజ్రపుతునకలలాంటి పిల్లలను ఇలా పోగొట్టుకున్నారంటే నాకు కడుపు నిండుతుందనుకున్నావా? నా దుఃఖం మరిచిపోతాననుకున్నావా?

నారాయణరావు

ఏం చేస్తాం. యుద్ధమిది. ఇలాంటి భయంకర విషయాలు అనేకం ఉంటాయి.

పద్మావతి

ఈ బీభత్సం చాలదనా ఇంకా బాంబులు తయారుచేస్తున్నావు? ఈసంగతి నీ మేనల్లుళ్లువింటే ఎంత విచారించే వాళ్లో. ఎంత సిగ్గుపడే వాళ్లో.

నారాయణరావు

యుద్ధం, యుద్ధం తప్పదాయెను, అధికార్లు యుద్ధమవ సరమని నిర్ణయించేసిన తరువాత ఎవరు చేయవలసిన సాయం వారు చేసితీరవలెకదా.

పద్మావతి

అయితే అంతగాయుద్ధమే చేయవలసివచ్చి నప్పుడు ధర్మ యుద్ధంచెయ్యండి. లేదూ యుద్ధం తప్పదని నిర్ణయించే రాజకీయవేత్తలను కొట్టుకొని చావమనండి. అదీకాదంటారూ, ఇందుకని నిర్ణయించబడి ప్రాణత్యాగం చేసుకోడానికి సిద్ధం గా ఉన్న సైనికులు ఉండనే ఉన్నారాయెను; వాళ్ళు యుద్ధాలు చేసి చస్తేచాలదూ? ఏమూలనో వున్న పల్లెలమీద పట్టణాల మీద మీ మారణ యంత్రాలు ప్రయోగించడ మెందుకు? ఏపాపమెరుగని స్త్రీ బాల వృద్ధులు, ఏపాపమూఎరక్క ఇంటి దగ్గర పడివున్న అమాయకులు వేనవేలు చావడమెందుకు? ఆ శత్రువులెవరో ఆ దేశాలేమిటో ఏమీ వాళ్ళకు తెలియదే! అటువంటప్పుడు వాళ్ళమీద వీళ్ళకూ, వీళ్ళమీద వాళ్ళకూ, కోపాలూ, వైరాలూ ఎందు కుంటాయి? ఎక్కడ ఎవళ్ళకే కష్టం వచ్చిందన్నా విచారపడేవాళ్ళు, ఎక్కడ ఏశుభంజరి గిందన్నా సంతోషించేవాళ్ళు, "లోకాః సమస్తాః సుఖినో భవంతు" అని మనసా వాచా సదా వాంఛించేవాళ్ళు – అటు వంటివాళ్ళను చంపడమెందుకో నాకర్థంకావడంలేదు.

నారాయణరావు

ఎందుకా? ఒక్కముక్కతో చెబుతాను: ఈ సైనికులను కని, పెంచి, పోషించేది మీరు. వాళ్ళుతినే తిండి, కట్టేబట్ట యిచ్చేది మీరు.వాళ్ళకు అవసరమైన అయుధసామగ్రిఅంతా

తయారుచేసి అందించేది మీరు. అందుకని వీటన్నింటికీ మూలాధారాలయిన పట్టణాల్తూ పల్లెలూ ధ్వంసంచేస్తేయుద్ధం ఆగిపోతుందని మా నమ్మకం.

పద్మావతి

అయ్యో! ఎంతవెర్రి. మీరు ధ్వంసంచేసిన ప్రతి ఒక్క గ్రామానికీ వీరభద్రుని సైన్యంలాగ నూరు బయలుదేరుతాయి

నారాయణరావు

ఈ కొత్త బాంబు పడ్డచోటమాత్రం అది అసంభవం.

పద్మావతి

నాయనా! నేనాడదాన్ని. రాజ్యాంగ తంత్రాలునాకు తెలియవు. నాకు తెలిసినది పతి వియోగ బాధ, పుత్రశోకమున్నూ.

నారాయణరావు

అవును, అవును వీరపత్నినీ వీరమాతవున్ను నీవు గర్వపడవలెనే గాని విచారించకూడదు.

పద్మావతి

పెనిమిటినీ, పిల్లలనూ దిగమింగి ఇల్లు వల్లకాడు చేసుకున్న నాకు గర్వం కాకేమి నాయనా!

నారాయణరావు

దానికేం చేస్తాము. దేశోపద్రవాలు వచ్చినప్పుడు ఇలాటివి తప్పవు మనకు.

పద్మావతి

కావచ్చు. అదే నాకు తెలియడం లేదంట: ఈ ఉపద్రవాలు తెచ్చిపెట్టేది నీవంటి శాస్త్రజ్ఞులూ, మీ విజ్ఞానంమీద

ఆధారపడ్డ రాజకీయ వేత్తలున్నా. సంహార కారకుడైన రుద్రుడు చేయవలసిన పని మీ రెందుకు తలపెట్టాలి? మీ కేమధికారముంది?

నారాయణరావు

ఎందుకు చేయకూడదు? అధికారం ఎందుకులేదు?

పద్మావతి

లేదు నాయనా లేదు. సృష్టి స్థితి సంహారాలకు అధికారి ఆ పరమేశ్వరుడు ఒక్కడే.

నారాయణరావు

పరమేశ్వరుడా! అతడెవడు? అలాటి వాడెప్పుడైనా ఉన్నా మానవుడు ఈ స్థితికి వచ్చిన తర్వాత తన అధికారాన్ని ఇతని చేతిలో పెట్టి తాను పదవి వదులుకొన్నాడు. మేము సృష్టి రహస్యాలు తెలుసుకున్నాం. ఆ సృష్టిని నిలిపే సాధనాలు సాధించాం. దాన్ని అవసర మైనప్పుడు సంహరించే మార్గ మున్నా తెలుసుకున్నాం. పరమేశ్వరుడు! మీ పరమేశ్వరు డెక్కడోలేడు. ఆ పేర్లు ఈ నాటి విజ్ఞానవేత్తకే వర్తిస్తుంది. పాశ్చాత్యులు సూపర్‌మన్ అన్నా మనం పురుషోత్తము డన్నా ఎవరో కాదు. ఈ సైంటిస్టే, విజ్ఞానవేత్తే.

పద్మావతి

అఁ అఁ అఁ ఏమి అహంకారం! మీసైన్సు యొక్క ప్రయోజనమూ పరమావధీ ఇదియేనా? అలాగయితే అందరూచేరి ఆ సైన్సునే నాశనం చేయండి. మానవ విజ్ఞానమూ. ప్రజ్ఞా, శక్తీ, యావత్తూ మానవ సౌఖ్యాభివృద్ధికిగదా వినియోగ పడవలసినది.

నారాయణరావు

అదే మేము చేస్తున్నపని. ఎటొచ్చీ కొంత కలుపు తీసివేస్తు న్నాము.

పద్మావతి

మనపెద్దలు తరతరాలనుంచీ ఎన్నెన్నో నూతన విషయాలు కనిపెట్టి మానవ సేవకోసం జీవితా లర్పించారన్న సంగతి మరిచిపోయావా?

నారాయణరావు

నేనెలా మరిచి పోతాను. నేనందుకనే మొదటనే చెప్పాను- వాళ్ళ విజ్ఞానమంతా నాలో మూర్తీభవించిందనీ.

పద్మావతి

అటువంటప్పుడు నీవుకూడా వారి మార్గం అనుసరించక యీ పెడదారి నెందుకు పడ్డావు నాయనా! అడదానిమాటలు అర్థంలేనివని అనుకోకు. ఇప్పుడైనా మించిపోయింది లేదు. నీవు చిన్నవాడవు. నీ జీవితమంతా ముందుంది. ఇంతవరకూ నీ జీవితంలో కొన్ని సంవత్సరాలు వ్యర్థమైనవేగాని నీ జాతికి కాని ప్రపంచానికి గాని వచ్చిన నష్టం ఏమీలేదు. మానవ జాతికీ దానిజీవితానికీ సౌఖ్యానికీ అవసరమైనవీ, నీవంటివాళ్లు చేయ గలిగినవీ బోలెడన్ని ఉన్నాయి. నీ శక్తింతా, జీవిత విశేషం అంతా అందుకు వినియోగించు.

నారాయణరావు

Yes, Yes, Oh Yes.

పద్మావతి

ఇప్పుడైనా తెలివితెచ్చుకొని ఈ ప్రయత్నం మానకపోతే

జన్మ జన్మాలూ విచారిస్తూ యీ పాప ఫలం అనుభవించ వలసి ఉంటుంది సుమా.

నారాయణరావు

ఫరవాలేదు. ఇంకొక జన్మ పాపం, దాని అనుభవం అంటూ ఉంటే అప్పటిసంగతి ఆలోచిద్దాం. ఇన్ని సంవత్సర ములూ చేసినకృషి ఇప్పుడు మానుకోడం సాధ్యముకాదు. పైగా అధికారులకు మాటఇచ్చిన తరవాత నా నాలుక కోసినా మాట తప్పను.

పద్మావతి

నీ స్వార్ధంకోసం ఇంతమంది అసహాయులను సంహరించ డంకంటె స్వార్ధం వదులుకుని వాళ్ళను యథేచ్ఛగా బ్రతక నివ్వడం మంచిది కాదూ?

నారాయణరావు

అది వేరేసంగతి – అప్రస్తుతం. నాపని మానుకోవడం అసంభవం! ముమ్మాటికీ అసంభవం!!

పద్మావతి

తమ్ముడూ, తమ్ముడూ! నువ్వీ ప్రయత్నం చేస్తున్నావని విని పుట్టెడుకష్టములోఉండికూడా నిన్నువారిద్దామనివచ్చాను. మీబావకూడా కొనఊపిరితో ఈపనికినన్ను నియోగించాడు.

నారాయణరావు

ఆయనబాధలో అలాఅని ఉండవచ్చు. కాని బావకాదుకదా మీ పరమేశ్వరుడనేవాడు వచ్చినా నే చేసిన కృషిని విడిచి పెట్టను.

పద్మావతి

అంతే అంటావా? ఈ నా శ్రమంతా వృధాఅంటావా? (బల్ల దగ్గరికి జరుగుతుంది)

నారాయణరావు

(ముఖం చిట్లించుకొని మాట్లాడడు)

పద్మావతి

(బల్లదగ్గరావచ్చి, దానిమీద సీసాలు తీసి) ఆశ్చర్యం! ఈ కాస్త చూర్ణంలో ఎంతశక్తి పెట్టాడు పరమేశ్వరుడు?

నారాయణరావు

(ఉత్సాహంతో) నేనూ ఆశక్తి వాటికిచ్చినది.

పద్మావతి

(చిరునవ్వుతో) ఈ కాస్తేనా నీవు తయారు చేసినది?

నారాయణరావు

అవును. ప్రభుత్వం వారికి కనబరచ డానికదిచాలును.

పద్మావతి

ఇది పోతే యింక లేదన్నమాట

(గభీమని సీసాలు అవతల పారవేస్తుంది)

నారాయణరావు

ఆఁ ఆఁ ఎంత పనిచేశావు. (పద్మావతిని సమీపిస్తాడు. ఒకరి నొకరు కోపంగా చూస్తారు.) ఫో అవతలికి. దుర్మార్గు రాలా! ఆ సీసాలు పారవేసినంత మాత్రాన అయిం దనుకు న్నావా? ఆ Formula నా వద్ద లేదనుకున్నావా? రెండు రోజులలో కావలసినంత తయారవుతుంది.

పద్మావతి

అలాగా, ఈ చిన్న పుస్తకంలోనా వ్రాసి వుంచుకున్నావు? (వెలుగుతూ ఉన్న స్పిరిట్ లాంపు అంటించి పుస్తకం కాలుస్తుంది)

నారాయణరావు

రాక్షసీ! (పద్మావతిని లాగి పుస్తకాన్ని అంటిన మంటలు ఆర్పబోతాడు; కాని లాభం లేకపోతుంది) ఛండాలురాలా! కష్టంలో ఉన్నావనీ, చిన్నప్పటి నుంచీ నన్ను పెంచావనీ నిన్ను గుమ్మంలోకి రానిచ్చాను. ఈ జన్మలో ఇంక నీ ముఖం చూడను. ఇంతటితో అయిపోయిందనుకున్నావు! నాచూర్ణాలు పారవేశావు. నాపుస్తకం తగలేశావు. కాని వాటి నన్నిటిసీ తయారు చేసినదీ తలకాయ. దీనిని నీవు నాశనం చేయలేవు. ఇంక నడుపు అవతలికి, నడువు (మీదికి వస్తాడు.)

పద్మావతి

చెయ్యలేకేం, అదీ నాశనం చేయగలను. నీనాశనంవల్ల లోకకల్యాణం అయితే నిన్ను కడతేర్చడానికి ఏమాత్రం సందేహించను. సంజీవి అనుకొని నాటిన మొక్క విషవృక్షమయితే దానిని సమూలంగా నాశనంచేయక ఏంచేస్తాం! (రివాల్వరు తీస్తుంది)

నారాయణరావు

(కంగారుగా ఒక అడుగు వెనక్కివేసి) ఏమిటిది? మతి లేదా ఏమిటి? నీకొచ్చిన కష్టంవల్ల మతి చలించి నట్టుంది. శేఖర్! ప్యూన్! ఎవరురా అక్కడ!

పద్మావతి

ఏం ! దీన్నిచూస్తే భయమేస్తోందా? ఇదొక్కటే నీమనో ధైర్యాన్ని చలింజేసిందేం? నీకు హితబోధచేశాను. న్యాయంవిచారించమన్నాను. ధర్మమార్గం చూపించాను. నీ పాషాణ హృదయాన్ని కరిగించ యత్నించాను. పాపభీతి ఉన్నదేమో అని చూచాను. ఇందులో ఏదీనిన్ను కదపలేక పోయింది. దేనియందూ లేని భయభక్తులు దీని యందైనా ఉన్నాయి గనుక దీన్నిచూచి అయినా నీ ప్రయత్నము మానుతావా? నిన్ను ఊరికే బెదరిస్తున్నా ననుకుంటున్నావేమో. చూచావా నీ మనస్సులాగనే నాచెయ్యికూడా ఎంత నిశ్చలంగా ఉన్నదో, నీకున్న కార్యదీక్ష నాకూవుంది. ఆఖరుసారి నిన్ను బతిమాలుతున్నాను. నీ దారుణ ప్రయత్నంమాని సన్మార్గానికి రా. నాచేత నీఘోరహత్య చేయించకు.

నారాయణరావు

దారుణ ప్రయత్నం నీదా నాదా? నేచేసేపని మంచిదనీ, దేశోపకారమనీ, ప్రజోపయోగ కరమనీ త్రికరణశుద్ధిగానమ్మి చేస్తున్నాను. నీవో! నీవాళ్లు పోయారనే కష్టంలో దుఃఖంలో హిస్టీరియాలో, న్యాయాన్యాయ విచక్షణ చేయలేనిసమయంలో యీ దారుణహత్య తలపెట్టావు. నీ చేతిలో తుపాకి చూచి భయపడ్డానను కొన్నావు కదూ! పొరపాటు. నీవు తాత్కాలి కోద్రేకంలో ఈ పని చేస్తున్నావు. తరువాత విచారిస్తావను కొని ఆపని సాగనీయకుండా చేదామనుకొన్నాను. వెర్రిదానా! నాకు భయ మేమిటి. అనుక్షణం మృత్యువుతో చెలగాట లాడే నాకా మృత్యువంటే భయం? నాచావువల్ల నీకేమయినా

లాభంవుంటే చంపు. వద్దనను. కాని యింతటితో యుద్ధాలు అంతరిస్తవని భ్రమపడకు. ఇంక నీయిష్టం.

పద్మావతి

నీ చావువల్లనాకేంలాభం నాయనా! అసలు నాకేంకావాలి? దేశరక్షణకోసం నాకు పుట్టిన బిడ్డలను అర్పించాను. మానవజాతికోసం, దాని సౌఖ్యం కోసం నిన్ను హత్యచేసి అయినా యీ పని మాన్పించాలనుకొన్నాను. ఈ గుణపాఠంవల్ల ఈ పనికి ఇతరులెవ్వరూ పూనుకోరని నానమ్మకం. నాయనా! నాకు గత్యంతరము లేదా?

నారాయణరావు

లేకేం, ఆ తుపాకీ అవతల పారవేసి మీవూరు వెళ్ళడమే. ఆలోచించగా నీవంటి భీరువులూ, దూరాలోచన లేనివాళ్ళూ పోతేనేగాని సంఘం బాగుపడదు. ఈలాటి చెత్తా చెదారం కొంత పోతేనేగాని మానవజాతికి అభివృద్ధీ అభ్యుదయమూ ఉండదనుకొంటాను.

పద్మావతి

ఛీ రాక్షసుడా! నీవు మనిషివికావు. (తుపాకి ప్రేల్చును. నారాయణరావు పడిపోతాడు. దగ్గిరాచేరి కూర్చొని) వీరమాతను. దేశంకోసం భర్తనూ బిడ్డలనూ పోగొట్టు కొన్నాను. లోక కళ్యాణంకోసం తమ్ముని హత్యచేశాను. పరమేశ్వరా! మృత్యోర్మా అమృతంగమయ.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# పెద్దమామయ్య

## పాత్రలు

సోమనాథశాస్త్రి

వెంకటేశ్వర్లు—పెద్ద మామయ్య.

సాంబమూర్తి—పెండ్లికొడుకు తండ్రి.

సుభద్ర—సోమనాథుని భార్య.

గ్రామమునసబు.

ప్రకాశం—సోమనాథశాస్త్రి బావమరిది.

శ్రీనివాసరావు—పెండ్లికొడుకు.

అవధానులు—పురోహితుడు.

సుశీల—పెండ్లికూతురు.

కరణము.

(సమయం మధ్యాహ్నం మూడు గంటల వేళ)

(సోమనాధంగారు తన ఇంట్లో కండ్లు మూసుకుని పడుకుని ఉంటాడు. అయన భార్య సుభద్రమ్మ భర్తని పిలుస్తూ ప్రవేశిస్తుంది.)

(మొదటిరంగం)

సుభద్ర

ఇదిగో,ఏమండోయిమిమ్మల్నే, నిద్దరా, ఏమటండీ, ఇదిగో? మాట్లాడరేం, నిజంగా నిద్ర పట్టిందా ఏమిటండీ ?

సోమనాధశాస్త్రి

ఏమిటిప్పుడు ముంచుకొచ్చిన వ్యవహారం ? నిజంగా నిద్ర ఒకటి, అబద్ధంగా నిద్ర ఒకటీనా ఏమిటి? సరిగ్గా నేను కన్నుమూయగానే వస్తాయేం నీ కెక్కడలేని పనులూనూ.

సుభద్ర

ఇంతట్లోకే అంత నిద్ర పట్టిందనుకో లేదు. ఊరికే నన్ను తమాషా చేయడానికి నిద్ర నటిస్తున్నారనుకొన్నాను.

సోమనాథశాస్త్రి

పాపం, ఇంకా తమాషాలు సరదాలు తీరలేదు కాబోలు.

సుభద్ర

తీరకేం, అన్నీ తీరాయి. మిమ్మల్ని చేసుకున్ననాడే తీరాయి. మీ వెటకారాలు, వెక్కిరింపులు మాటకేం కాని, పిల్ల పెళ్లిమాట ఏమిటి ? వైశాఖం వెళ్లింది. జేష్టం సగం చెల్లింది. ఎక్కడా చీమకుట్టినట్టన్నా లేదు. శ్రావణమాసం నాటికైనా...

సోమనాథశాస్త్రి

చీమకుట్టినట్టు ఏం ఖర్మం. తేలుకుట్టినట్టే ఉంది.

సుభద్ర

ఉంటే ఏదీ? ఎక్కడికీ గుమ్మం కదలరాయును. ఏ సంబంధం చూడరాయును. పిల్లాడిని మనం చూసుకోవాలి గాని, పిల్లను వెతుక్కుంటూ ఎవరైనా వస్తారేమిటీ?

సోమనాథశాస్త్రి

రాకేం చేస్తారు? పుష్పం ఉన్న చోటికి తుమ్మెదలు రావాలిగాని, తుమ్మెదలకోసం పుష్పం బయల్దేరుతుందా ఎక్కడైనా?

సుభద్ర

మీ కవిత్వాలు కట్టిపెట్టండి. ఇలా కవిత్వాలుకట్టుతూనే యింతకాలం వృధాగా కాలక్షేపం చేసారు. బారెడు మేరలో ఉందాయును, అన్ని విధాలా బాగున్నదనుకుంటిమాయెను. ఆ కాకినాడ సంబంధం ఏమైందో కాస్తమళ్ళీ కదపకూడ దటండీ? ఓ మాటుకి పదిమాట్లు తిరగాలి. తప్పుతుందా యేమిటి? వాళ్ళ అవుసరమా, మన అవుసరమా?

సోమనాథశాస్త్రి

కదుపుతూనే ఉన్నాను. మన పెద్ద మామయ్యతో గూడా చెప్పాను. అతను కనుక్కొని ఏదో తేలుస్తానన్నాడు.

సుభద్ర

ఊహుఁ, చెప్పారు కదా పెద్ద మామయ్యతోటి. ఇంక తేలినట్టే వ్యవహారం

సోమనాథశాస్త్రి

తేలకేం జేస్తుంది, అదే తేలుతుంది.

సుభద్ర

అయినా మధ్యను ఈయన రాయబారం ఎందుకు ప్రతి దానికీని ? ఈ పూళ్లోవాళ్లకి ఎన్నటికీ మైనార్టీ వదలడం ఆయనయాజమాన్యం తప్పిస్వంతంగా వ్యవహరించుకోవడం ఉండదావిమిటి ?

సోమనాథశాస్త్రి

యాజమాన్యం ఏమిటిగాని, ఏదో....పెద్దముండావాడు, ఆయనకదో సరదా. అన్నింటిలోను తనున్నాడనిపించుకోడం, తనవల్లనే సమస్త కార్యాలు సాధ్యమైనా యనిపించుకోవడ మున్ను, ఒకొక్కళ్ళకి ఒకొక్క వెర్రి.

సుభద్ర

అన్ని ఆయన నెత్తిని రుద్ది మీరంతా కాళ్లుచాపుకూచ్చోడం మీకు వెర్రి. ఎవళ్ల వెర్రి వాళ్ళ కానందం.

సోమనాథశాస్త్రి

ఇవాళో రేపో ఏదో తేలుస్తానన్నాడు.

సుభద్ర

పోనీ ఆయన నెత్తినికూచునిఅయినా కాస్తతొందరపెట్టండి, మీరు సంబంధం చూసుకోలేకపోతేను, హఠాత్తుగా ఎప్పుడో ఒకప్పుడు, ఈ పెద్ద మామయ్యాహరీ అంటే, ఈ పూళ్లోవాళ్ళు ఏమైపోతారు. వాళ్ళ పనులేలా జరుగుతాయి. పిల్లలకు సంబంధాలు ఏలాగుదొరుకుతాయి.నాకు మహాచెడ్డభయంగా ఉంది. కొంపతీసి ఆయనతో ఈ పూళ్లో వాళ్ళంతా సహగమనం చేయరుగదా ?

సోమనాధశాస్త్రి

అఘోరించావులెద్దూ, తెలివి తేటలకు సంతోషించాను. పాపం, ఆ బ్రాహ్మడిమీద పట్టించావేం ?

సుభద్ర

ఆయనమీదా పట్టించలేదు, మీ మీదా పట్టించలేదు. ఆయన ధర్మమా అని సంబంధం చూస్తానన్నారు కనుక సరి పోయింది కాని, ఈ పిల్లను పెళ్ళేమిటంటే, మనగతేం కానా అని ఆలోచిస్తున్నాను,

సోమనాధశాస్త్రి

ఏదో ఎప్పుడైనా కాస్త తొందరపడ్డా, మొత్తంమీద మంచి వాడు. ఏమనన్నా నాబొందో అని చచ్చేటట్టు తిరిగి చేస్తాడు. ఇవాళ తప్పకుండా వచ్చి కనపడతా నన్నాడు.

సుభద్ర

పోనీ ఓ మాటు లేచి అలా వెళ్ళకూడదూ? ఆయినా అంత బద్ధకమేమిటమ్మా అన్నింటికీని.

సోమనాధశాస్త్రి.

సరే, అయితే కాసిని మంచినీళ్ళిచ్చి, నా ఖండువా యిలా తెచ్చిపెట్టు, వెళ్ళొస్తాను. నీ సాధింపు పడలేకుండా ఉన్నాను.

సుభద్ర

మరే, పాపం.

పెద్ద మామయ్య

(వస్తూ) ఏమోయి సోమనాధం.

సోమనాథశాస్త్రి

ఇదుగో పెద్ద మామయ్యో, వెయ్యేళ్లు, యిప్పుడే నీమాట అనుకుంటున్నాం. నువ్వెక్కడా కనపడటం లేదు. ఎలా వున్నావో చూసిరమ్మంటే, మా ఆవిడ, బయల్దేర బోతున్నాను. ఏమిటి బొత్తిగా మామీద యిలా శీతకన్ను వేశావు ?

పెద్ద మామయ్య

ఇంక మేము శీతకన్ను వేస్తే నీకేం? వేడి కన్నువేస్తే నీకేం? రెండోపిల్ల పెళ్ళిదాకా నా అవసరం లేదుగదా నీకు!

సోమనాథశాస్త్రి

ముందు పెద్దదాని పెళ్ళి తేలిన తర్వాతకదా, రెండోదాని మాట. అంతవరకూ నీదే బాధ్యత.

పెద్ద మామయ్య

ఎవరి బాధ్యతాలేదు. అదృష్టవంతుడవు.

సోమనాథశాస్త్రి

అదేమిటి ? నిమ్మళంగా తప్పించుకొని అవతలకి జారుదా మనుకుంటున్నావా యేమిటి ?

పెద్ద మామయ్య

నీ రొట్టి నేతిలో పడ్డదిలేవయ్యా.

సోమనాథశాస్త్రి

ఏమిటీ ?

పెద్ద మామయ్య

సంకల్ప సిద్ధుడవు.

సోమనాథశాస్త్రి

ఏమిటయ్యా, మామయ్యా చంపుతున్నావు. సంబంధమే మైనా చూశావా యేమిటి ?

పెద్ద మామయ్య

పిల్ల మహా అదృష్టవంతురాలు.

సోమనాథశాస్త్రి

నన్ను చంపక సంగతేమిటో చెపుదూ.

పెద్ద మామయ్య

సంబంధమనగా సంబంధమా ? అదృష్టవంతులకు అన్నీ అలా కలసివస్తాయి.

సోమనాథశాస్త్రి

సరే, నీ కబుర్ల కేం లెద్దూ.

పెద్ద మామయ్య

అలాగే చూద్దుగాని, కాస్సేపుంటే నీకే తెలుస్తుంది.

సోమనాథశాస్త్రి

ఏమిటి తెలిసేది ?

పెద్ద మామయ్య

ఏమిటా ? పెళ్ళివారు రావడం, పిల్లని చూసుకోవటం, పెళ్ళికొడుకును మీరు చూడటం, ఒకొళ్ల కొకళ్ళు నచ్చడం, తథాస్తు అనుకోవటం ముహూర్త నిశ్చయం చేసుకోవటం, మీరు పెళ్ళిపనులు ప్రారంభించటం, నేను సంబారాలన్నీ సంపాదించటం, చాలా యిప్పటికి ?

సోమనాథశాస్త్రి

ఏమిటి? వాళ్ళిప్పుడొస్తారా పెళ్ళివారు! యిప్పుడు! చంపావు కాస్త ముందు చెప్పకూడదు మామా! ఇదిగో ఏమేవు! ఏం చేస్తున్నావు? నిన్నే, అమ్మాయి ఏది?

సుభద్ర

ఏమిటా కేకలు వస్తుంటేను?

సోమనాథశాస్త్రి

పెద్ద మామయ్య పిల్లకి సంబంధం తీసుకొచ్చాడు. నే చెప్పానా, అతను దేవాంతకుడు, సంబంధం ఎక్కడున్నా గాలించి లాక్కొస్తాడుఅని. మామా, అసాధ్యుడవోయి.

సుభద్ర

అయితే ఎవరు? ఏ వూరు?

సోమనాథశాస్త్రి

అవంతా తర్వాత చెప్తాంగాని, ముందు పిల్లని ముస్తాబు చెయ్యి, వాళ్ళిప్పుడు చూడ్డానికి వస్తారట.

సుభద్ర

ఏమిటిప్పుడే? అదేమిటండీ కాస్త ముందేనా చెప్పారు కాదు?

సోమనాథశాస్త్రి

పోనీ యిప్పుడైతేనేం, త్వరగాకానీ.

సుభద్ర

ఆ హడావుడేమిటండి? ఎవరో, ఏవూరో, సంగతేమిటో, సం దర్భమేమిటో, ఏమీ తెల్సుకోకుండా, ఎవళ్ళు పడితే వాళ్లకి అడగ్గానే పిల్లని చూపించటమేనా ఏమిటి? కాస్తమంచీ, చెడ్డా

కసుక్కోవటం, ఆర్షేయ, పౌరుషేయాలు చూసుకోవడం ఏమీ లేదా ఏమిటి? ఎవరో రావడం, ఏదీ పిల్లఅనడం, మనం తీసుకొచ్చి చూపించడమూనున్నూ, ఇదేం కూరకాయల బేరమా ఏమిటి?

సోమనాథశాస్త్రి

ఓసి వెర్రిదానా, అదా, నీసందేహం? పెద్దమామయ్యఅవేం చూడకుండా తీసుకొస్తాడనుకొన్నావా యేమిటి? వాళ్ళను ఎన్ని పరీక్షలూ చేయకుండా వచ్చాడనా, నీ వుద్దేశం?

పెద్దమామయ్య

మీ అవిడ నే నేదో ఒట్టి నాయునమ్మ ననుకుంటోంది.

సుభద్ర

అబ్బే, ఆదికాదు బాబుగారూ ఎంతమాటన్నారు. మీమీద గౌరవం, నమ్మకం లేకనుకాదు. మావారేదో కాకినాడ సంబంధం అంటేనూ, అదా మరొకటా, అని అడిగాను. మరేం లేదు. ఆడదాన్ని, అదుర్దాకొద్దీ అడిగాను. మీరేమీ అనుకోకండి.

పెద్దమామయ్య

ఫరవాలేదమ్మా. అనుకోటానికి ఏముందీ? ముందు చెప్ప వలసిందేగాని, వ్యవధిలేకపోయింది. కాకినాడ సంబంధం కాదు, దాని తాతలాటి సంబంధం ఇది. నేను మొన్న పనుండి రాజమండ్రీ వెళ్లాను. అక్కడ నా చిన్ననాటి స్నేహితుడొకడు కనబడ్డాడు. మాటల సందర్భంలో అతని కొడుకొక డున్నాడని విని, వెంటనే మనపిల్లమాట చెప్పి. చేసుకుంటేగాని వీల్లేదని బలవంతపెట్టి...మహా గునిశాడులే...ఇప్పుడు కాదనీ, ఈ యేడు చేయననీ, ఆలోచిస్తాననీ, వెనకనుంచి

ఉత్తరం రాస్తాననీ, మామూలు పద్ధతులు ఉన్నాయికదూ, మగపిల్లలున్నవాళ్ళకు-అన్నీ ఏకరువు పెట్టాడు. అవేం నాదగ్గర పనికిరావని, ముందు పిల్లనిచూడమని రెక్కపట్టుకొని లాక్కొచ్చాను. మన పిల్లను చూచిన తర్వాత వద్దని వదులుకునేవాడు ఎవడుంటాడమ్మా?

సుభద్ర

ఏదో బాబుగారికి మామీద అభిమానంచేత అనటమేకాని, ఇంతసూ పిల్ల అదృష్టం. వస్తా. క్షణంలో పిల్లకు తలదువ్వి, కాఫీకి కాసిని నీళ్ళుపడేసి.

పెద్దమామయ్య

ఏమమ్మోయి, అభిమానంకాదు, ఏంకాదు, ఆ ఊళ్లో, ఈ ఊళ్లోనేకాదు, ఈచుట్టుపక్కల గూడా మన పిల్ల ముందు నిలబడటానికైనా ఎవళ్ళకూ తాహతు లేదు. దానికి తలదువ్వకపోయినా సరే, అలంకరింపకపోయినా సరే, వెర్రి ముండ, అలాంటిపిల్ల ఉన్నదటమ్మా. పిల్లా అది, రత్నం కాని.

సోమనాథశాస్త్రి

చాల్లెద్దు మామా, నీపొగడ్తల కేమి? అంత అందంగా ఉన్నదని, ఎవళ్ళైనా ఊరికే చేసుకుంటారు గనుకునా? కట్నం మస్తుగాయిస్తే, పిల్లకు రూపం, గుణం, శీలం ఏమీ అక్కర్లేదు, చాలా మందికి,

పెద్దమామయ్య

అందరూ అలా వుంటారుటయ్యా. పైగా మన దగ్గిర కట్నాలుగిట్నాలు మాట తల పెట్టారంటే తన్ని తగిలేస్తాను. మనపిల్లను చూసి చేసుకోవలసిందే కాని, డబ్బుని చూసి చేసికునేవాళ్ళు పిల్లనేం సుఖపెడ్తారు?. కాస్తచనువిస్తే ఇప్పుడు

అక్కడ నుంచి పంపకుర్రమ్మన్నా, కార్యం చేసుకోమన్నా పిల్లను తీసుకెళ్ళమన్నా, అన్నిటికీ ఏదోవంకపెట్టి పేచీలు ఆరంభిస్తారు. వాళ్ళకు డబ్బే పావనం.

సోమనాథ శాస్త్రి

నిజమేకాని, లోకాచారం ఒకటి ఏడుస్తోందికదూ? కట్నం లేకుండా చేసుకుంటే మరీ సంతోషం. వాళ్ళడక్కపోతే అడిగిన కన్న ఎక్కువ ముట్టచెప్పతే ఎవళ్ళ మర్యాద వాళ్ళకు దక్కుతుంది,

పెద్దమామయ్య

నీ కెందుకు? నువ్వుమాట్టాడకూరుకో. నేను చెప్తాను. గదూ. ఆ నిష్ఠూరాలేవో, నేనే పడతాను.

సోమనాథ శాస్త్రి

అలాగే గాని, పిల్లవాడెలా వుంటాడు? ఏం చేస్తున్నాడు? వాళ్ళ స్థితిగతులు ఏమిటి? కులగోత్రాల సంగతి నేనడగ నక్కరలేదనుకో. మన గౌరవానికి తగ్గ సంబంధం కాకపోతే, నువ్వసలు చూడనే చూడవు.

పెద్దమామయ్య

అబ్బే, అటువంటి పొరపాటు చేస్తానా? శ్రీపాదవారు, రాజ మండ్రి, పెళ్ళికొడుకు తండ్రి సాంబమూర్తి అని, యింజనీరు పని కొన్నాళ్ళు, కంట్రాక్టులు కొన్నాళ్ళూచేసి, బాగా సంపా దించాడు. పిల్లవాడు బి. ఏ అనర్సు పరీక్షకు వెళ్ళాడు. సిసింద్రీలాంటివాడు, రూపానికి చెప్పక్కర్లేదు. ఇన్నిమాట లెందుకు? అన్నివిధాలా మన పిల్లకు తగ్గవాడు. మాటలతో పనేముందీ? మీరే చూస్తారుగదూ యిప్పుడు?

సోమనాథశాస్త్రి

ఏమిటి? వరుడుగూడా వస్తున్నాడా? ఓరి! దేవాంతకుడ వేయి నువ్వు. నువ్వులేక పోతే, మేమంతా ఏం కావలసిందీ?

పెద్దమామయ్య

అది తరువాత ఆలోచిద్దాం. పిల్ల తయారయిందా? వాళ్ళొస్తూంటారు యీ పాటికి. ఇదిగో నువ్వుమట్టుకు ఏమీ తొందర పడి ఇంతిస్తాను, అంతిస్తానని గంతులు వెయ్యకేం. ఇదిగో, మాటలోనే వచ్చారు పెళ్ళివారు.

(ప్రవేశం సాంబమూర్తి-శ్రీనివాసరావు)

దయచేయండి సాంబమూర్తిగారు. రావోయి శ్రీనివాసరావు. ఏమిటి పూళ్ళో అడుగు పెట్టే సరికే, పెళ్ళికళ వచ్చిందేమిటి!

సోమనాథశాస్త్రి

దయచేయండి. చాలా సుదినం యీవేళ. మా పెద్ద మామయ్య ధర్మమా అని, మీ దర్శన భాగ్యం, పరిచయ భాగ్యం కల్గింది, మాకు.

పెద్దమామయ్య

యీ కబుర్లకేం. మా శ్రీనివాసరావుని యిక్కడ కట్టి వేయ కల్గినట్లయితే, అప్పుడు నీ అదృష్టం అనుకున్నా, ఏమనుకున్నాను.

సాంబమూర్తి

నుంచున్న పళంగా లాక్కొచ్చావుకదా. ఊరికే కట్టివేయిస్తావో, సంకెళ్లే వేయిస్తావో, ఏం ముళ్ళు వేయిస్తావో, మరి.

సోమనాథసాస్త్రి

ఏం ముళ్ళు వేయిస్తారులెండి. మూడు ముళ్లూ వేయి

స్తారు. మా పెద్దమామయ్య ఎంతకైనా సమర్థుడు లెండి. ఏమే, కాళ్లు కడుక్కొనిడానికి నీళ్ళిచ్చి దాహం తీసుకురా, లేకపోతే పట్నవాసస్థులు వారు కాఫీ పుచ్చుకుంటారేమో.

సుభద్ర

ఇదిగో వచ్చాను.

(ప్రవేశం–సుభద్ర)

అన్నగారూ కాళ్ళు కడుక్కోండి. నాయనా కాళ్లు కడుక్కో బాబూ. వారు కాఫీ పుచ్చుకుంటారో, టీ పుచ్చుకుంటారో కనుక్కోండి.

సోమనాధశాస్త్రి

చూశావా మామా. మా ఆవిడ పల్లెటూరి దైనా, పట్నవాసపు మర్యాదలు నేర్చుకుందయ్యావు. ఏదో ఒకటి తీసుకురా త్వరగా, పిల్లనికూడా తీసుకురా.

సుభద్ర

క్షణంలో వస్తున్నాను. పిల్లకూడా సిద్ధంగానే ఉంది.

(నిష్క్రమణ)

సోమనాధశాస్త్రి

ఇదిగో తువ్వాలు. ఇలా దయచేయండి. ఇక్కడ కూచుందాం. కాఫీ తీసుకోండి.

సాంబమూర్తి

అబ్బే, ఇప్పుడేవీ అక్కర్లేదండి. ఏదీ పిల్లను ఒకసారి చూపిస్తే మళ్ళీ తొందరపని ఉంది.

పెద్దమామయ్య

వెడుదురుగాని. పిల్లను చూస్తే ఆమాటనవు. ముందు

కాస్త ఫలహారంచేసి కాఫీ తీసుకో. పిల్లని చూడడానికి వెళ్ళి నచోట భోజనం చేయ్యకూడదు కాని, కాఫీ ఫలహారాలకు అభ్యంతరం లేదు.

సాంబమూర్తి

అభ్యంతరంకోసం కాదు.

సోమనాథశాస్త్రి

పిల్లను తీసుకొస్తుంది. ఫలహారం కానివ్వండి. ఏమే, ఇంకా తెమల్లేదు.

సుభద్ర

ఇదిగో వచ్చాను.

(ప్రవేశం సుభద్ర-సుశీల)

సోమనాథశాస్త్రి

దా అమ్మా, ఇలారా, ఇక్కడకూచో. (ఒక్కక్షణంనిశ్శబ్దం)

పెద్దమామయ్య

ఏమోయి సాంబం. మాట్లాడవేం. ఎలా ఉందిపిల్ల. రెప్ప వాల్చకుండా అలా చూడకండి. మా అమ్మాయికి దృష్టితగులు తుంది. ఏదో తొందర పనుందన్నావు. లేవవేం.

సోమనాథశాస్త్రి

ఉండవోయి, నీ వేళాకోళాలూ నీవూను. బాబూ. ఇలావచ్చి ఇక్కడ కూచో నాయనా. నువ్వేమీ మొహమాట పడకు. నిదానించి చూసుకో. మేమేమీ అనుకోము.

సాంబమూర్తి

అమ్మాయి, ఏమన్నా చదువుకుంటోంవాండి.

సోమనాధశాస్త్రి

ఏం చదువండి. పల్లెటూరు చదువులు. తమకు తెలియని దేముంది. ఏదో సంస్కృతంలో పంచకావ్యాలూ, రెండు మూడు నాటకాలూ అయ్యాయి. తెలుగుకూడా బాగా చెప్పించాను. కొద్దిగా హిందీ చెప్పించాను. ఇప్పుడంతా చదువుకుంటున్నారని పిల్ల సరదా పడితే మేష్టరుని పెట్టి, ఇంగ్లీషు కూడా చెప్పిస్తున్నాను. మీదటికి కాశీపరీక్షకు, మెట్రిక్యులేషనుకు పంపుదా మనుకున్నాను. మాకు యాత్రా దాని పరీక్షా రెండు కలిసి వస్తాయని.

సాంబమూర్తి

బాగుంది. చాలా బాగుంది.

పెద్దమామయ్య

ఎందుకండి వెధవ చదువులు. కూటికా గుడ్డకా. మొగాళ్ళకి ఈ చదువులు పనికి రావనుకుంటూ ఉంటే, ఆడవాళ్ళకెందుకు?

శ్రీనివాసరావు

అమ్మాయి ఏమన్నా పాడుతుందా అండి.

పెద్దమామయ్య

భేష్. ఈ కాలం కుర్రాడు అడగవలసిన ప్రశ్న అడిగావు. కిన్నెరలా పాడుతుంది.

సోమనాధశాస్త్రి

ఏదో కొద్దిగా పాడుతుంది. వీణకూడా నేర్చుకుంటోంది. కాని బాగా చెప్పేవాళ్ళు లేరండీ. ఇక్కడ.

సాంబమూర్తి

ఏదేనా పాడమ్మా ఒక్కపాట.

సోమనాథశాస్త్రి

పాడమ్మా భయంలేదు.

పెద్దమామయ్య

మేష్టరుగారు లేందే భయంగాఉంది.

సోమనాథశాస్త్రి

భయమెందుకమ్మా, పరవాలేదు పాడు.

పెండ్లి కూతురు

శ్రుతికూడా లేకుండా ఎలాగ?

శ్రీనివాసరావు

శ్రుతిలేకుండా పాడుతేనే బాగుంటుంది.

సోమనాథశాస్త్రి

సరే కానియ్యి.

పెండ్లికూతురు

(పాట)

సాంబమూర్తి

బాగుంది, చాల్లే అమ్మా.

శ్రీనివాసరావు

ఇంకొక్కటి సినీమా పాటేదేనా?

సాంబమూర్తి

ఎందుకు నాయనా, తరవాత సావకాశంగా వినొచ్చు.

పెద్దమామయ్య

ఆ మూడు ముళ్ళూ పడ్డతరవాత నువ్వు 24 గంటలు పాడించుకోవచ్చు, వంటావిడ వంట చేస్తుంది. ఇంటావిడ పాడుతుంది.

సాంబమూర్తి

శలవిప్పించాలి. మళ్ళీ దర్శనం చేస్తాను.

సోమనాధశాస్త్రి

మా పిల్లను ఎలాగైనా మీ ఇంట్లో పడేసుకోవాలని మా ప్రార్ధన.

సాంబమూర్తి

అలాగే, శలవు.

సోమనాధశాస్త్రి

మంచిది మామా, ఏం చేస్తావో నీ దయ. శెలవు.

పెద్దమామయ్య

మళ్లీ వస్తానోయి.

(పెళ్లివారు నిష్క్రమిస్తారు)

సోమనాధశాస్త్రి

ఏమే ఎలా ఉంది సంబంధం.

సుభద్ర

నామాటకేం? మీ అమ్మాయి నడగండి ముందు.

సోమనాధశాస్త్రి

ఏమమ్మా తల్లీ, రా, ఇలారా? ఎలాఉన్నాడు పెళ్లి కొడుకు?...చెప్పమ్మా షరవాలేదు. చెప్పకపోతే ఎలా తెలు

స్తుంది. నీ కిష్టంలేని సంబంధం చేస్తామని కలలో నేనా అనుకోవద్దు.

సుభద్ర

చెప్పమ్మా, ఇక్కడ పైవాళ్లెవ్వరూ లేరులే.

పెళ్ళికూతురు

బాగానే ఉన్నారు.

సోమనాధశాస్త్రి

బాగానే ఉన్నాడా, చాలా బాగున్నాడా?

సుభద్ర

చాల్లెద్దురూ మీ కబుర్లూ మీరూను.

సోమనాధశాస్త్రి

అయితే వారు వప్పుకుంటే నీకభ్యంతరం లేదన్న మాటేనా.

పెళ్ళికూతురు

అలాగే.

(ప్రవేసం-పెద్దమామయ్య)

పెద్దమామయ్య

నేను చెప్పలేదుటోయి, మన పిల్లను చూస్తే వారు విడిచి పెట్టరని, వారు తథాస్తు అనుకోడానికి వచ్చారు.

(ప్రవేశం-సాంబమూర్తి, శ్రీనివాసరావు)

సోమనాధశాస్త్రి

చాలా సంతోషం, దయ చెయ్యండి. మాపిల్ల అదృష్టం

ఇంతకూను. మీకోడలు కావడమనేది ఎంత సుకృతం చేసు కుంటేను.

పెద్ద మామయ్య

నువ్విప్పు డాయన్ను అట్టే స్తోత్రం చెయ్యకు.

సాంబమూర్తి

మన పెద్ద మామయ్య చాలాదూరం బలవంత పెడుతున్నా డీసంబంధం చేసుకుంటేనే కాని వీలులేదని.

సోమనాథశాస్త్రి

ఆయన బలవంతంమీద చేసుకుంటున్నా రన్నమాట.

సాంబమూర్తి

అబ్బే, అదికాదు, తమ మర్యాదా మంచీ అన్నీ విన్నాను. మనకు ప్రధానంగా కావలసినది అదే కాదండీ!

సోమనాథశాస్త్రి

అయితే పిల్లవా డేమంటాడు? వివాహం చేసుకోవలసిన వాడూ, అనుభవించ వలసినవాడూ అతనుకాదండీ మరి.

సాంబమూర్తి

వాడికీ అంగీకారమే, పైగా కుర్రనాగమ్మ, వాడికేం తెలు స్తుంది.

పెద్దమామయ్య

ఇప్పుడు కుర్రవాడి పట్టేనయ్యా. తథాస్తు అనే దాకా వా డీవూరునుంచి కదలనంటున్నాడు.

సోమనాథశాస్త్రి

బాగుంది, చాలా సంతోషం, అయితే ఇంకనేం. అతన్ని కూడా తీసుకురా. తాంబూలాలు ఇచ్చేద్దాం.

సాంబమూర్తి

ముహూర్తాని కేమిటెండి? అలాగే చూద్దాం. కాని, మరి....ఆ...

పెద్దమామయ్య

అతని గొడవ అదికాదోయి. ముడుపు ఏమి చెల్లించుకుంటావూ అని అతనడిగేది.

సోమనాథశాస్త్రి

దానికేముంది, తమ శలవు అన్నారుగా. పిల్లకు రెండు వేల రూపాయల కన్నెతోడు గుంది. ముద్దు ముచ్చటలకూ మామూలు లాంఛనాలకూ ఏమీ లోటుండదు. వివాహం మీ చిత్తం వచ్చినట్టు చేస్తాం.

సాంబమూర్తి

కట్నం అంటూ ఏదో, కావాలని కాదుసుమండీ, లోకాచా

సోమనాథశాస్త్రి

పోనీ అలాగే, తమ అభిప్రాయమేమిటో శలవిప్పించండి.

సాంబమూర్తి

బెజవాడ సంబంధం ఎరుగుదువుగా మామా, మూడువేలు ఇస్తామన్నారు. ఇంకా ఏవేవో అన్నారు, ఏమిటో అప్పటిలో ఊరుకున్నాం. ఆమధ్య నిడదవోలు నుంచి ఒక రొచ్చారు. నాలుగు వేలిస్తామని. తణుకు వాళ్లు చెప్పనే అక్కర్లేదు. ఐదువేలి స్తామనీ, ఒక్కతే పిల్లనీ, ఆస్తంతా, వానిదే ననీ, కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమాలుతున్నారు.

పెద్దమామయ్య

పాట ప్రస్తుతం అయిదువద్దిర ఆగిందన్నమాట.

సాంబమూర్తి

పాటకాదేయి. జరిగిన సంగతి చెప్పాను. నేను ఇందులో ఒకర్ని రితోనూ ఇంత కావాలని అనలేదు.

పెద్దమామయ్య

ఊరికే ఎంత వస్తుందో చూదామని ఆగావన్నమాట.

సోమనాథశాస్త్రి

అయితే ఇప్పుడు ఏమిశలవిస్తారు.

సాంబమూర్తి

శలవుకేముంది. ఒకరు పెట్టనే పెట్టారుగా. ఆ అయిదూ మీరు...

సోమనాథశాస్త్రి

అయిదు వేలే—

సాంబమూర్తి

ఇంకొక రిస్తామంటున్నది...

సోమనాథశాస్త్రి

వారికింక పిల్లలు లేరంటున్నారు కదూ. మాకింకా ఉన్నారు. పైగా మా ఆవిడింకా ముసలిదికాలేదు కూడాను. అందుచేత తమరేదో కాస్త ఆలోచించి....

సాంబమూర్తి

ఆలోచనకేముంది. బాబూ, డబ్బుచూసుకుంటే సంబంధాలు ఎలావస్తాయి?

పెద్దమామయ్య

రాకేంచేస్తాయి. మహ చక్కగా వస్తాయి. అయిదు వేలు కావాలేం? ఈ వేలిస్తామన్న వాళ్ళపిల్లలు ఒక్కరేనా మా పిల్లకు దిగదుడుపుకేనా పనికొస్తారా? తణుకు సంబంధం నేను ఎరుగుదును. చేసుకో పాపం. ఆస్తి కూడా చాలా వస్తుంది. పిల్ల తాతగారు బాగున్నారు. గ్రామ పౌరోహిత్యం. రోజూ ఇంట్లో గుమ్మడి కాయకూ, కందకూ, అరిటికాయకీ, పెసరపప్పుకీ తడుముకో నక్కర లేదు. క్షేమంగా ఉంది, చేసుకో పాపం. బెజవాడ సంబంధం ఎరుగుదును. అది బాగానే ఉంటుంది. ఎంతమంది వెళ్లినా భోజనానికి అభ్యంతరం ఉండదు. వాళ్ళ హోటల్లో పూటకు రెండు మూడు వందలమంది లేస్తారు. బహు అనుకూలంగా ఉంటుంది. చెప్పొచ్చావు సిగ్గులేక.

సాంబమూర్తి

అందుకనే అవేమీ చేసుకో లేదయ్యా.

పెద్దమామయ్య

నాకుతెలుసు. ఆ సంబంధాలకీ దీనికీ సాపత్యం తెచ్చి, కట్నమడుగుతావేం?

సోమనాధశాస్త్రి

పోనీ లేవయ్యా. అడుగుతే తప్పేముంది. వారు అడగడమూ తప్పులేదు, మనం ఇవ్వడమూ తప్పులేదు. తాహతు ఉండాలి కాని.

పెద్దమామయ్య

అలాగేం. ఎందుకు తప్పులేదు. రెండూ తప్పే.

సోమనాధశాస్త్రి

అలా అంటే ఎలాగు. ఏదో మనం ఇంత ఇవ్వ గలమని అందాం వారికి నచ్చితే చేసుకుంటారు.

పెద్దమామయ్య

ఇవ్వగలవు లేవయ్యా మహ. ఉన్నవాడవు ఎలాగైతేనేం బయలు దేరావు.

సోమనాధశాస్త్రి

నువ్వలా పట్టు పట్టకు. ఏదోమోస్తరుగా మనం సర్దుకుందాం. వధూవరులకు ఒకళ్ళకు ఒకళ్ళు నచ్చి, తక్కినవన్నీ బాగున్నప్పుడు ఏదో ఓవంద అటో, ఇటో చూసుకోవాలి.

పెద్దమామయ్య

ఇదుగో ఈవిషయంలో నువ్వేం మాట్లాడకు.

సాంబమూర్తి

సరే అయితే శలవా.

సోమనాధశాస్త్రి

దయచెయ్యండి ఎదురుగాని, మీరేదో మరోమాట అనాలిమరి.

సాంబమూర్తి

నేనింక ఏమని ఏమి లాభం. పెళ్ళిచేసేవారు మీరనుకున్నాను కానిపెద్దమామయ్య అనుకోలేదు.

సోమనాధశాస్త్రి

ధర్మమా అలాఅనడం. ఏదో అతను చనువుకొద్దీ.

పెద్దమామయ్య

అవునయ్యా. నేనే చేసేవాడిని. అతని వంతు పిల్లల్ని కనడం మట్టుకే. తరువాత బాధ్యతంతా నాది. సరేనా.

సాంబమూర్తి

అందుకనే శలవు ఇప్పించమంటున్నాను.

పెద్దమామయ్య

అయితే నువ్వు కట్నంలేనిదే పిల్లాడికి పెళ్ళి చెయ్యవన్న మాట.

సాంబమూర్తి

అలాగే అనుకో.

పెద్దమామయ్య

సరే, అయితే వెళ్ళు లక్ష్మిలాంటిపిల్లను వదులుకుని వెళ్ళి నువ్వేమాత్రం సంబంధం తెస్తావో చూస్తాను.

సోమనాథశాస్త్రి

అబ్బా. ఆపట్టువదలెందుకు మనంఏదో—

పెద్దమామయ్య

ఇదిగో నిన్ను ఊరుకోమని చెప్పానా. కట్నంకావాలేం కట్నం. లక్షసార్లు కట్నాలు కూడదని లెక్చరిచ్చాడు ఇతను. దేశాభిమాని. తన దగ్గరకొచ్చేటప్పటికి ఎన్ని వేలిస్తావంటాడా?

సోమనాథశాస్త్రి

పోనిద్దూ. ఆగొడవ మనకెందుకు? మనశక్తి వంచన లేకుండా?

పెద్దమామయ్య

చాల్లే మహ కూతుర్ని కన్నా వెలా గై తేనేం. అతను అప్పుకుచచ్చినా ఒక్క దమ్మిడీ ఇవ్వను. ఏంచేస్తారో చేసుకోండి. కట్నం! వాళ్ళబ్బనాడూ వాళ్ళతాతనాడూ కట్నాలు పుచ్చుకునే చేశారు పెళ్ళిళ్ళు. కట్నం! ఈ ఉన్నదంతా చాలక ఇంకా అయిదువేలు కట్నంట. కూడా కట్టుకెడతాడు కాబోలు. నాకుపనుంది, నేను వెడుతున్నాను కాని, నువ్వు కట్నమిచ్చావంటే మాటవక్కడు. శలవు.

(పెద్దమామయ్య నిష్క్రమణ)

సాంబమూర్తి

ఏడెక్కడ దొరికేడండీ మీకు. ఈ ప్రేతగాడు శుభాలకు పనికిరాడు.

సోమనాథశాస్త్రి

అతను పెద్దవాడు. మాకందరికీ అప్తుడూను.

సాంబమూర్తి

అయితే ఇతన్ని నమ్ముకుంటే మీ పనులు అయినట్టే. పిల్లకు సంబధం దొరికినట్టే.

సోమనాథశాస్త్రి

అతని మాటల కేమిలెండి. మనం ఏదో అనుకుంటే ఇది రెండోవాళ్ళ చెవినిపడ నక్కరలేదు.

సాంబమూర్తి

ఏమంత దొంగతనమేం ఖర్మం.

సోమనాథశాస్త్రి

దొంగతనం కాదు. అల్లరెందుకని. మావూరికల్లా అతను పెద్ద. మాకందరకూ బోలెడంత అండగాఉంటాడు, ఏమీ అపేక్షలేనివాడు. అతనితోటి వైరమెందుకని.

సాంబమూర్తి

సరే, అయితే నాకుశలవు. రేపు పీటలమీద కూచున్న తరువాత ఇతను వీలులేదంటే అప్పుడేం చెయ్యం.

సోమనాథశాస్త్రి

అలాకాదు. నామనవి వినండి. మనం ఒక తమాషా చేద్దాం. అతను రేపు ఊరికెడుతాడు. ౧౫ రోజుల దాకా రాడు. రేపు బుధవారం కాక పైబుధవారం నాడు మంచి ముహూర్తం ఉంది. ఆ ముహూర్తానికి వ్యవధి తక్కువగా ఉన్నా ఎలాగో అయిందనిపిద్దాం. మీకేలోటూ రానివ్వను. మా పిల్లను మీ పిల్లగా చేసుకోడమే నా అభిలాష. అనుగ్రహించాలి,

సాంబమూర్తి

సరే, అయితే వాడి తెగులు కుదురుద్దాం. అలా చేయించండి. మావాళ్లల్లో ఇన్ని వేలిస్తామన్న సంబంధాలు వదులుకుని ఈ సంబంధం ఊరికే చేసుకున్నానన్న అపఖ్యాతి మట్టుకు రానివ్వకండి.

సోమనాథశాస్త్రి

ఎంతమాట. అపఖ్యాతి కూడానా, తమకు బోలెడంత ఖ్యాతి వస్తుంది.

కలవు మరి.

సోమనాథశాస్త్రి

శలవు. సుముహూర్త మయ్యేవరకూ రెండో చెవిని పడని వ్వకండి.

(అంతా నిష్క్రమిస్తారు)

రెండవ రంగం

[పెళ్లి పందిర-మంగళధ్వని అవుతూ వుంటుంది.]

ప్రకాశం

ఏమర్రా, మంగళ స్నానాలు అయినాయా లేదా? ఇదుగో చూడండి. మంగళ సూత్రానికి వెళ్ళారర్రా? అక్కయ్యా, ముందు పిల్లని గౌరీపూజకు కూచోపెట్టండి. బావా త్వరగా తెమలాలోయి. మళ్ళీ ఆ ముండా కొడుకొస్తే చస్తాం.

సోమనాథశాస్త్రి

మా ఆలస్యం ఏమీ లేదు, ఏమంటేయి, అవధాన్లుగారూ తెమలరేం ఖర్మం. పెద్దమామయ్య ఊడిపడ్డాడంటే—

అవధానులు

రండి బాబూ రండి. కొబ్బరి బొండం తాంబూలంచేత్తో పట్టుకురండి. యశ్శివో నామరూపాభ్యాం, యాదేవీ సర్వ మంగళాః తయోఃసంస్మరణాత్ పుంసాం సర్వతో జయమం గళాం-లాభస్తేషాం, జయస్తేషాం, కుతస్తేషాం పరాభవః యేషాం ఇందీవర శ్యామో, హృదయస్థో జనార్దనః-ఆపదా ముపహర్తారం దాతారం సర్వసంపదాం లోకాభిరామం

శ్రీరామం భూయోభూయో నమామ్యహం. సర్వమంగళ మాంగళ్యే, శివే, సర్వార్థసాధకే, శరణ్యేత్ర యంబకే దేవి, నారాయణి నమోస్తుతే. ఆ తాంబూలాలూ, బొండాలూ యిలా యిచ్చి కూచోండి, ఆచమనం చేయండి, కేశవా యిస్వాః; నారాయణాయి స్వాః; మాధవా.

నాంభమూర్తి

చూడండి అవధానులుగారూ, సాధ్యమైనంత టూకీగా తెమల్చాలి. ఆ ముండాకొడుకు రాకముందు మూడు ముళ్ళూ పడితే...

అవధానులు

ఎంతోసేపా, అయిపోయింది, ఏమండీ పిల్లని తీసుకురండి. కన్యాం కనక సంపన్నాం... ఆ జ్యోతులు తీసుకురండి ముత్తైదువులు.

అవధానులు

ఏమండోయి, కానివ్వాలి-మహాసంకల్పం లేకపోతే మంగళ సూత్రం ముడిపడదా యేమిటి?

అవధానులు

పడకేమండీ? పెళ్లికొడుకు తప్ప తక్కినదేం లోపించినా ముడిపడ్డానికి అభ్యంతరంలేదు.

నాంబమూర్తి

కానివండి. లోటుబాట్లు ఏమైనా ఉంటే, సాయంకాలం సావకాశంగా ఏ కరువు. పెట్టుకుందాం.

అవధానులు

ఆc, అయిపోయిందండీ, భజంత్రీలు వాయించండ్రా.

ప్రకాశం

బాబోయి, పెద్దమామయ్యా వస్తున్నాడు.

అంతా

అయ్యో వాడ్ని తగలెయ్యా.

అవధానులు

ఇప్పుడుకాదు బాబూ అమంగళం. ఈ మూడు ముళ్లూ పడ్డతర్వాత మీ యిష్టంవచ్చినట్లు చెయ్యండి.

ప్రకాశం

మునసబుగారూ పెద్ద మామయ్యాను ఒక్క క్షణం గుమ్మం లోనే ఆపి బాతాఖానీ కొట్టండి. బాబూ మాట దక్కించాలి. కరణంగారూ కాస్త మీరుకూడా నోరూ, అవసరమైతే చెయ్యి గూడా చేసుకోవాలి.

మునసబు

మీకేం ఫరవాలేదు. ముందు ముడేయించండి. మంత్రాలు తరవాత ఏ కరువు పెట్టవచ్చు.

సాంబమూర్తి

బావగారూ, తంతంతా తర్వాత జరుపుదాము. ముందు ముడి పడ నివ్వండి.

సుభద్ర

ఈ దిక్కుమాలిన శనిగాడెక్కడ దొరికాడు మనకీ గ్రామా రిష్టంలాగ! శుభమా అని పిల్లకి పెళ్లిచేసుకుంటూంటే ఏ ముద్దూ ముచ్చటా లేకుండా యిదేం ఖర్మం పానకంలో పుడక లాగ.

సోమనాథశాస్త్రి

ఊఁ అలాగే. ముద్దు ముచ్చట్లన్నీ తర్వాత జరుపుకుందాం. ఏమండీ అవధాన్లుగారూ యింకా ఏమిటాలస్యం?

అవధానులు

చిత్తం. ఏమీలేదు బాబూ. యిలారా నాయనా, యిది మెళ్ళో ముడేయి. నా మెళ్ళో వేసేవుగనక. పెళ్ళికూతురు మెడలో మూడు ముళ్లూవెయ్యి. యిప్పుడుకొంచెం ఒదులు గానే వెయ్యి. తర్వాత బిగిద్దాం.

(ప్రవేశం–పెద్దమామయ్య)

మునసబు

ఇదిగో పెద్దమామయ్య వచ్చాడయ్యా. ఏమయ్యా ఎక్కడికి పోయావు? మంచి సమయానికీ మాయమయ్యా వేమిటి?

పెద్దమామయ్య

నేను మాయమయ్యానుకాదుమరీ పెద్దలంతా గ్రామపెద్దలు, గూడుపుఠానీ చేసి, చేశారుగా నిర్వాకం. నేను మాయమ య్యానేం?

మునసబు

అది ఏమిటయ్యో. మధ్యమ మామీద పడతారేం. సంబంధం కుదిర్చినవారు మీరూ, చేసినవారూ మీరూ.

పెద్దమామయ్య

అందుకనే, ఏరుదాటి తెప్పతగలేసినట్లు నా అవసరం తీరి పోయింది. వజ్రపు తునకలాంటి అల్లుడు దొరికాడు. ఇంక నా అవుసరం ఏముందీ? విశ్వాసాలు అలా వుంటాయి. అఁ, అదేదో కనుక్కొని...

మునసబు

అయితే ముహూర్తం నీకు తెలియకుండానే? ఆఁ, ఆరి వీడిల్లు బంగారంగానూ, ఎంతపని చేశాడు, సోమనాథం.

పెద్దమామయ్య

ఏమీ ఎరగనట్టు నటించకండి. ఒళ్ళు మండిపోతూను, మీ ఎవ్వరి ఆలోచనా లేకుండా గ్రామంలో యింత దారుణం, యింత అవమానం నాకు జరిగిందా.

మునసబు

నమ్మండి నా మాట. నేనూ ఊళ్ళో లేను, యీ మధ్యను. యింతకూ మీ అందరి సలహా ఎందుకు? అతని కూతురు పెళ్ళికి. కాని పెద్దవాడవు నువ్వు లేకపోవడం మట్టుకు మహా లోటుగా ఉంది. పందిరంతా చిన్న పోయింది. ఆత్మనకూడా మహ యిదైనాడు, నువ్వు లేకపోతిపని.

పెద్దమామయ్య

ఇదుగో, ఇంక నీ గడుసుతనం కట్టిపెట్టు. నాకు తెలుసు నీ నక్క వినయాలన్నీ.

మునసబు

అదేమిటి మామా, నన్ను పట్టించావేమిటి? హహహ... (నవ్వుతాడు)

కరణం

ఇదుగో పెద్ద మామయ్యో! ఇప్పుడొచ్చావేమిటి? ఇందాకటి నుంచీ మాకు ఒకళ్ళకూ మతులులేవు. నువ్వు లేకపోవడం ఎంతలోటుగా ఉంది. ఒక్క పనికీ కాలూచెయ్యీ ఆడదు.ఒక్క

వస్తువూ సమయానికి అమరదు. అందుకనే మనవాళ్ళు పెద్ద తలకాయ లేకపోతే, గొర్రెతలకాయి పెట్టి జరుపమన్నారు.

పెద్దమామయ్య

గాడిద తలకాయి పెట్టి జరప మనలేదూ. చాల్లేవయ్యా, నేర్చుకుపోయావు. మహా గడుసుతనం. ఎలాగైతేనేం? నేను లేక పోవడం అంతలోటు అనుకున్నవాళ్ళు, కాస్త కాకిచేత కబురుపంపలేక పోయినారా? నేను చానన్నానా? ఈ సంబంధం తెచ్చిన వాడ్ని పట్టంటానా? ఎందుకీ దొంగతనం? అతన్నే అడుగుతాను.

కరణం

అయితే నీకు కబురే లేదూ? ఆశ్చర్యంగా ఉంది. ఎంత వాడయ్యాడు మన సోమనాథం. ఊం. మనవాళ్ళ వ్యవహారం యిలానే ఉంటుంది. నీకు తెలియదన్న సంగతి నేను ఎర గను సుమా. నేనేనా కాస్తకబురంపిద్దునూ.

పెద్దమామయ్య

కావాపురి. నువ్వనలే అమాయకుడవు, అందుకనే కరి ణీకం చేస్తున్నావు. పోనిద్దూ. మీరంతా తెలివైనవాళ్ళు, గడుసు వాళ్లూను. ఇంతనూ ఒకళ్ళను అనవలసిన పనేముందీ! ప్రతీదీ నానెత్తిని వేసుకుని, నా బొందో అని ఏడవటం నాదే తప్పు, నా పనులు మానుకుని, నిద్రాహారములు మానుకుని, చీమూ, నెత్తురూ ధారపోసి, ఈ పూళ్ళోవాళ్ళకోసం నేను పడ్డ బాధలు, ఇన్నా అన్నీ కావు. పోనీ ఇందులో నా స్వార్థంకోసం ఏమైనా ఏడ్చానా. ఇందులో ఒక్క గాడిదకొడుకేనా ఒక్క ఎర్రని ఏగాని, ఎప్పుడైనా చేతులో పెట్టాడా? నాకొక్కవాలని

కాదు సుమీ. ఊరికే మన వాళ్ళ సంగతి చెప్తున్నాను. ఇంత వెధవ పూరిదే కాని-

కరణముగారు

అయితే, మామా, అఁ, ఏమిటి విశేషాలు. చెన్నపట్నం కబుర్లు?

పెద్దమామయ్య

ఏమున్నాయి వస్తా.-

కరణం

అయితే చూడు. యుద్ధం కబుర్లు ఏమిటి? అంతా చల్లారి నట్లేనా?

పెద్దమామయ్య

పోనిద్దూ, ఆ వెధవ గొడవ యిప్పుడెందుకూ. వస్తా.

కరణం

వెళ్ళువుగానిలేవయ్యా. ఒకటే హడావుడి. అదికాదు, మన వాళ్ళు మళ్ళీ యద్ధం వస్తుందంటా రేమిటి?

పెద్దమామయ్య

అలాగేం, మళ్ళీ వస్తుందేం. రానీ, మరీమంచిది. ఇంకా ప్రాభాలు తిందామనుకుంటున్నారు కాబోలు. ఈమాటు ఈ పూరి వెధవల్నందర్నీ కట్ట కట్టి యుద్ధానికి పంపిస్తాను. తెగులు కుదురిపోతుందిదాంతో. ఎంతవరకొచ్చిందో చూసి.

కరణం

ఎంతవరకూ ఏముందీ? సుముహూర్తం అయిపోయింది. తలంబరాలు పోసుకుంటున్నట్టున్నారు.

పెద్దమామయ్య

ఏమిటీ, ఒక్కమాటు రెండు–

ప్రకాశం

ఇదుగో బాబుగారే! మీరు వూళ్ళోలేరని వినేసరికి నేను నిలువునా నీరైపోయినాను,

పెద్దమామయ్య

అలాగేం పాపం, మళ్ళీ ఎలా గడ్డకట్టావు?

ప్రకాశం

ఏముందీ, గభీమని మనవాళ్ళు తీసుకువెళ్ళీ అదేదో అయిసుపెట్టిలో పెట్టి ఉంటారు.

పెద్దమామయ్య

పెళ్ళి అయేదాకా, అందులోనే ఉండు, ఈ వేసికి మళ్ళీ కరిగిపోగలవు, వస్తా.

ప్రకాశం

బాబుగారు, మా చెడ్డవారు: మీరు వేకపోతే యేమీ సరదా లేదు.

పెద్దమామయ్య

ఆహాఁ, అలాగేం! వస్తున్నా.

ప్రకాశం

అయితే బాబుగారూ, మన స్వరాజ్యం మాట ఏమైందో! పట్నంలో ఏమనుకుంటున్నారు?

పెద్దమామయ్య

వస్తోందిట. అక్కడనుంచి-ఏది–సీమలోనుంచి బయల్దేరే సన్నాహంమీదనే ఉందట: వస్తా.

ప్రకాశం

బాబూ ఏమిటి మళ్ళీ ఎరక్షన్లు అనుకుంటున్నా రేమిటి?

పెద్దమామయ్య

పోనిద్దూ వెధవ సంత. ఎవళ్ళ కేమైతే మనకేం, వెళ్ళి రెండు అక్షింతలు...

సాంబమూర్తి

బతేవాడవేయి మామ. నిన్ను నమ్ముకుంటే, ఏదో నమ్ముకుని ఈతకు దిగినట్టే.

పెద్దమామయ్య

కావా మరి. సంచులు పట్టాయిగా మరి పళ్ళేసూ, అవి కట్టుకునే యాదు.

సాంబమూర్తి

సంచులు లేవు, గించులు లేవు.

పెద్దమామయ్య

వాటికోసమే కాదూ నీగోల. నేనుంటే అవేం రాలవని ఈ పన్నాగం పన్నావు,

సాంబమూర్తి

పన్నాగం మేముందీ. ఊరికే ఉన్నవాడ్ని పెళ్ళిమాటేనా అనుకోనివాడ్ని, నుంచున్న పళంగా లాక్కొస్తివి. సంబంధం చేసుకో మంటివి. ఇంతదూరం నువ్వు చెప్పావుకదా పెద్ద మనిషివి, చిన్నప్పటినుంచీ ఎరుగున్న వాడవు, స్నేహితుడవు. ఏమన్నా అనుకుని పోతావని, బొలెడన్ని సంబంధాలు కావలని నవీ, పైవి, వేలకువేలు యిస్తామంటూంటే వదులుకుని,

నీమీద గౌరవంకొద్దీ ఈ సంబంధం ఒప్పుకుంటే, నువ్వు సమయానికి వాటేసి పైగా ఏదో పన్నాగం అంటావేమిటి?

పెద్దమామయ్య

పన్నాగం కాకేమిటి మరి. నేను దగ్గరుంటే కట్నంపేరు చెప్పి ఒక చిల్లిగవ్వేనా నీకు దక్కనిచ్చేవాడిని కాను. ఆ సంగతి నీకు తెలుసు, ఎలాగైనా పిల్లకు పెళ్లి చేద్దామనే వాళ్ళ అదుర్దా గ్రహించి, వీలైనంత రాబట్టుకుని నేను వూళ్ళోలేకుండా చూసి, సుముహూర్తం పెట్టించావు.

సాంబమూర్తి

కట్నంలేదు గిట్నంలేదు.ఇంకోచోటైతే నాకుకట్నం రాదనా.

పెద్దమామయ్య

కట్నంరాకేం. ఇలాటి పిల్లమట్టుకు రాదు. లక్ష్మి అవతారం కాదూ. అందుకనే మొగ్గావు. లేకపోతే ఒప్పుకుంటావు నువ్వు. సరే ఇంతకూ కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు. కానియ్యి. వస్తాను.

మునసబు

వస్తాను వస్తాననుకుంటూ వచ్చినప్పటినుంచి ఏమిటా హడావిడి. వెడుదువుగానిలే.

పెద్దమామయ్య

అలాగే. ఎక్కడికీ వెళ్ళడంలేదు. ఒక్కమాటు వాళ్ళదగ్గరకువెళ్లి...

కరణం

వెడుదువుగాని మామా. మళ్లీ ఊరుప్రయాణం ఏమన్నా ఉందా ఏమిటి?

పెద్దమామయ్య

ఊరూ లేదు గీరూలేదు- వాళ్ళనో మాటు...

సాంబమూర్తి

ఉండుమామా, మావాడు చందన తాంబూలాలు తీసుకు వస్తున్నాడు. తాంబూలం తీసుకుని మరీ వెడుదుగాని.

పెద్దమామయ్య

నేను ఎక్కడికీ వెళ్ళడంలేదర్రా?

సాంబమూర్తి

అయితే ఇంకనేం. ఆశీర్వచనం అవుతోంది. కానిచ్చి వెడుదుగాని.

పెద్దమామయ్య

ఇదెక్కడ గొడవ. నామాట వినిపించుకోరేం ఖర్మం ఊరికే ఓ మాటు.

ప్రకాశం

ఇదిగో బాబూ నువ్వూరికే అలా ప్రయాణాలవకు. వచ్చిందో అడుగూ రానిదో అడుగూ. ప్రయాణమేమిటి?

పెద్దమామయ్య

అది కాదర్రా.

ప్రకాశం

పనుల కెక్కడికి ఉంటోంటాయి. ఇన్నాళ్ళనుంచీ లేనందుకే మేము ఇదవుతుంటే ఇప్పుడు మళ్ళీ వెడతానంటారే మిటి?

పెద్దమామయ్య

వెళ్ళడం.

ప్రకాశం

ఇంక నామాట తల పెట్టకండి. వంటలైపోయాయి. ఆశీర్వచనం కాగానే మడికట్టుకోడమే.

పెద్దమామయ్య

ఆశీర్వచనం అయి.

సాంబమూర్తి

ఉండాలి తప్పదు. ఈ అయిదు రోజులూ నువ్వు కదలడానికి వీలులేదు.

మునసబు

వీళ్లంతా ఇది చేస్తున్నప్పుడు మామా నువ్వు తొందరపడకూడదు.

కరణము

స్నానమయిందా. రండి మడికట్టుకు చక్కావద్దాం.

అంతా

శతమానం భవతి.

పెద్దమామయ్య

ఇదేమిట్రా దిక్కుమాలాళ్ళల్లారా. యములాళ్ళలా పట్టుకుని వదలరేం ఖర్మం. ఒక్కమాటు పెళ్ళికొడుకునీ, పెళ్ళికూతుర్నీ పీటలమీద చూసి రెండు అక్షింతలు వేసి ఆశీర్వదించి వద్దామంటేను,

అందరూ

అయ్యో, విధిగానూ, రండి.

అవధానులు

పెద్దమామయ్యగారూ. ఆశీర్వచనం చేయించండి.

పెద్దమామయ్య

సమస్త సన్మంగళాని భవంతు.

అందరూ

తథాస్తు.

పెద్దమామయ్య

నిత్య శ్రీరస్తు,

అందరూ

తథాస్తు.

పెద్దమామయ్య

దీర్ఘాయుష్యమస్తు.

అందరూ

తథాస్తు.

పెద్దమామయ్య

అంచంద్రార్కం వంశాభివృద్ధిరస్తు.

అందరూ

తథాస్తు.

పెద్దమామయ్య

సర్వతో దిగ్విజయమస్తు.

అందరూ

తథాస్తు.

# అసాధారణ సమావేశము

## పాత్రలు

నారాయణరావు [కార్యదర్శి]
సభాపతి [సభాపతి]

| | |
|---|---|
| సాంబశివరావు<br>శేషగిరి<br>రామారావు<br>వెంకటరావు<br>కర్మవీరుడు<br>క్రైస్తవుడు<br>మహమ్మదీయుడు | సభ్యులు |

(సమయం - సాయంకాలము అయిదు గంటలకు)

స్థలం - ఒక చిన్నపట్టణంలో ఒక పాతమేడమీదగది.

కాలం - యుద్ధానికి ముందు.

నారాయణరావు

ఏమయ్యా పురాణపురుషా. మీరేనా దయచేశారు. చాలా సంతోషం. మూడు గంటలకు మీటింగు అనుకున్నామూ. ఇప్పుడు నాలుగు దాటుతోంది. ఇంతవరకూ ఒక్క పురుగైనా చూపుమేరలోనైనా లేదు.

సాంబశివరావు

కోప్పడితే ఎలాగయ్యా! ఇళ్ళూవాకిళ్ళూ, సంసారాలు ఉన్న వాళ్ళకు ఏవో పనులుంటాయి. చటుక్కున అన్న నిమిషానికి ఎలా తెంపుకొస్తారు.

నారాయణరావు

ఎలాగో ఒకలాగు రావాలి. లేదా ముందే వీలుపడదని చెప్పాలి. ఇంతకూ ఇళ్ళూ, వాకిళ్ళూ, సంసారాలు లేనివాళ్లు కూడా ఉన్నారుగా మనమెంబర్లలో.

సాంబశివరావు

నిజమే కాని వాళ్ళుకూడా చక్కపెట్టవలసిన సంసారాలు ఉంటాయికాదు మరి.

నారాయణరావు

ఏమిటీ?

సాంబశివరావు

ఏవో చక్కపెట్టుతూఉంటే వాళ్ళవి కాకపోయినా ఇతరులువే అనుకో.

నారాయణరావు

చాల్లెద్దురూ, మీ కబుర్లూ మీరూను.

సాంబశివరావు

పెద్దవాడిని నేనేం చెప్పినా అలాగే ఉంటుంది. మీకారు వాళ్ళకు. పైగా వారం వారం మీటింగులేసి చంపుతే ఎలాగ. ఇంతకూ ఈ మీటింగులు పెట్టి చేశే నిలవాకం ఏమిటో చెవుదూ.

నారాయణరావు

ఏమి టేమిటి, మనం చెయ్యావలసినది బోలెడంత ఉంది. మనవాళ్ళున్నారే, ఏది వీళ్ళంతా బొత్తుగా ఇదయి పోతున్నారు

సాంబశివరావు

ఏమయిపోతున్నారంటావు.

నారాయణరావు

ఏమయిపోతున్నారేమిటి ఒళ్ళు మండిపోతూను ఏపే ఎరగనట్టు. ఏమయిపోవడం లేదంట.

సాంబశివరావు

(నవ్వుతాడు.)

నారాయణరావు

(కొంచెం కోపంగా) అందుకని, మనం సమావేశమై కొన్ని తీర్మానాలుచేసి, ఒక కార్యక్రమం, ఒక ప్రణాళిక తయారు చేసి, మనవాళ్ళందర్నీ ఇదిచేస్తేతప్ప దేశమంతా బొత్తుగా అధోగతిలోకి పోతుంది.

సాంబశివరావు

ఇదిగో చూడు నారాయణరావు, నువ్వు ఊరికే excite అయిపోయి, మనవాళ్లిదయిపోతున్నారు, అదయి పోతున్నారంటే నాకేం బోధపడడంలేదు. ఇప్పుడు మనం ఏం చెయ్యాలో స్పష్టంగా చెపుతేనే కాని.

నారాయణరావు

ఏం చెప్పనూ. ఒక్కళ్లూ ఊడిపడరాయను. నలుగురూ త్వరగా తగులడితే, తరువాయి సంగతి ఆలోచించవచ్చును.

సాంబశివరావు

వస్తారయ్యా. రాకేం చేస్తారు. వచ్చిన తరువాత చేసేదేమిటో ముందు నిర్ధారణచేసుకోవద్దూ.

నారాయణరావు

చేసుకోవద్దన్నానా నేను. నాఅభిప్రాయం ఏమిటంటే మనం కలుసుకొని, సాంఘికంగా, రాజకీయంగా, నైతికంగా, ఆర్థికంగా, ఏరీతిగా మనవాళ్ళను ఉద్ధరించాలో ఆలోచించి, మనం కొన్ని ఉపసంఘాలు ఏర్పాటుచేసి, ఒక నిర్మాణ కార్యక్రమం తయారుచేసి, అది సత్వరంగా, సక్రమంగా ఆచరణలో పెట్టే పద్ధతులు ఆలోచించాలి,

సాంబశివరావు

బాగుంది. చాలా బాగుంది. కానీ నువ్విలా తొందర పడకూడదు—ఇదంత అర్జంటుగా నిమిషాలుమీద తేలే వ్యవహారంకాదు. దేనికేనా తొందర కూడదు.

నారాయణరావు

తొందరేమిటండీ కొంపలంటుకుపోతుంటేను. మనవాళ్ళు

రోజు-రోజూ ఎంత ఇదైపోతున్నారో చూస్తున్నారా—తినడం తిరగడం, అయినవాళ్ళనీ, కానివాళ్ళనీ అన్నప్పుడూ ఆడిపోసుకోడం వీడు వెధవా వాడుకుంకా అనడంతో సరిపోతోన్నాయి వాళ్ళ జీవితాలన్నీని, అందుచేత.

సాంబశివరావు

అందుచేత మన సంఘ సమావేశాలతో మార్చివెయ్యాలంటావు,కానియ్యి. కుర్రవాడువూ, ఉత్సాహవంతుడవూనూ. నీవు కాకపోతే మాలాటివాళ్ళం, ఇక్ష్వాకులనాటివాళ్ళం ఏమి చెయ్యగలం.

నారాయణరావు

మీదయవుంటే చాలదుటండి. పెద్దవాళ్ళు మీరలా నిలబడి మమ్మల్ని ఆశీర్వదిస్తూ మీ moral support ఇస్తే చాలు.

సాంబశివరావు

హ్హ హ్హ హ్హ. దానికేం.

నారాయణరావు

ఇంకా మన సభాపతిగారేనా దయచేశారు కారేమిటి.

సాంబశివరావు

ఇది మరీ బాగుంది. సభాపతిగారు, సభాపత్నిని సమాధాన పరచి మరీ రావాలంటావా లేకపోతే శ్రీమహావిష్ణువు లాగ ఎక్కడి వక్కడ విడిచిపెట్టో, పట్టుకునో పరగెత్తుకుని రమ్మన్నావా.

నారాయణరావు

ఎలాగో ఒకలాగు త్వరగా దయచేస్తే బాగుండును. ఏది

పట్టుకొచ్చినా మన అభ్యంతరంలేదు. మనకింకా ఆలస్యం కాకుండా తీరగా పని తెములే చాలు.

సాంబశివరావు

పొరపాటున పట్టుకురావడమేవస్తే ఆయన చాలా పట్రావలి. మనపని అప్పుడనలే తెమలదు. మనవాళ్ళకూ Chivalry ఎక్కువ చూడు. స్త్రీలెవరొచ్చినాఅందులోనూ కాస్త అందమైన వాళ్లు వస్తే, వారి యోగక్షేమాలు కనుక్కోవడంలోనూ వారికి వద్దంటున్నా, బలవంతపెట్టి, టిఫన్లు, డ్రింకులు వగైరా సప్లయిచెయ్యడంలోను, ఇతరులను గురించి అపవాదులు చెప్పడంలోనూ నిమగ్నులై ఉంటారా మన వాళ్ళంతానూ. మన పనప్పుడనలే తెమల్దు.

నారాయణరావు

అదీ నిజమే, ఏదొచ్చినా మనప్రాణానికే వస్తుందే.

సాంబశివరావు

పోనీ నువ్వేపనిచెయ్యరాదూ. తక్కినవాళ్ళు వస్తేనేం రాకపోతేనేం. సభాపతిగారు తప్పక వస్తారు. ఆయన తోటి నీ అభిప్రాయమేమిటో కాస్త చూచాయగా చెప్పేస్తే, అన్ని ఏర్పాట్లూ ఆయనే చేసేస్తారు. పెద్దవాడూ అన్నీ తెలిసినవాడూను, ఏమంటావు.

నారాయణరావు

సరేలేండి. ఆయనమీద పెడితే అయినట్లే. ఏదో పెద్దవాడొకడుంటే అలంకారంగా ఉంటుందని ఆయన్ని అలా నిలిపాం కాని, ఆయనబొంద ఆయనకేం తెలుసునండి,

సాంబశివరావు

అమ్మమ్మ. అలా అనకు. తప్పు. మహానుభావుడు, అయ నకు తెలియకపోవడమేమిటి.

నారాయణరావు

అయనకన్నీతెలుసునని అయన అనడంకాబోలునని మనం అనుకోడమే కాని, మనలో మనమాట: అయనకేమీ తెలియ దంటే నమ్మండి. ఇంకా వెంకట్రావనండి, అతనికి సమస్తం తెలుసును. Russia ని గురించి, Germany ని గురించి ఒకటేమిటి ఏ దేశాన్ని గురించి, ఏమడిగినా సరే. సమస్తమైన వాకబూ అతని నాలుక చివర వుంటుంధి. అక్కడివాళ్ళు మనుష్యులు, అచారాలు, వ్యవహారాలు వీధులు, ఇళ్ళు వాకిళ్ళు ఒకటేమిటి: సమస్తం అతనికి తెలుసు. అఖరికి వాళ్ళు ఏ రోజున ఏకూర వండుకుంటారోకూడా గుక్కతిప్పు కోకుండా చెప్పేస్తాడు. విజ్ఞానమంటే అది కాని...

సాంబశివరావు.

సరే అయితే మనదేశంసంగతి కూడా పూర్తిగా తెలుసునన్న మాటేగా.

నారాయణరావు

మనసంగతి తెలియడానికి తెలుసుకోడానికీ ఏముందండీ. మనకేంలేందే. అందుకనే మనం సమస్తం రష్యానుంచి యత్క్రంచిత్తు అమెరికానుంచి దిగుమతి చేసుకోవలెనని మా అభిప్రాయం.

సాంబశివరావు

అవునుకాని ఈ మధ్యను మనవాళ్ళ అందరి అస్తులూ లెక్క కడుతున్నాడు మన వేంకట్రావు ఎందుకో.

నారాయణరావు

సామ్యవాది కాదండీ అతను. ఇదంతా లెక్క వేసి. సిద్ధంగా ఉంచుతే, యుద్ధానంతరం సామ్యవాదం మనకుకూడావస్తే వెంటనే పంపకాలకి వీలుగావుంటుందని మంచి దూరదృష్టి గల వాడులెండి మనవాడు. మనవాళ్ళకు కొందరికేనా మళ్లీ కబురుచేదామంటే శేషగిరేనా వచ్చాడుకాదేమిటి.

సాంబశివరావు

సరేలె A.I.R. Announcer కేనా తీరికుంటుందికాని మని శేషగిరికి తిండి తినడానికేనా తీరికలేదు.

నారాయణరావు

ఏం ఏం

సాంబశివరావు

నాచేత వాగించాలని నీ ఉద్దేశంకాని నీకు తెలియకనా మనవాడికి ఎక్కేగుమ్మం దిగేగుమ్మం. ఎక్కడేం జరుగుతున్నదీ వాడు తెలుసుకోవాలి. అదంతా వెళ్లి ఇంకొకళ్ళతో చెప్పాలి. వాళ్లూ వీళ్లూ ముళ్ళెట్టుకు చస్తుంటే వాడు చూసి ఆనందించాలి. ఒకటా గొడవ. ఇదుగో మాటలోనే వచ్చాడు శేషగిరి. రావోయి వెయ్యేళ్లు.

నారాయణరావు

అబ్బ. ఏంబాబూ నువ్వేనా దిగావు ఇప్పటికి. తక్కినవాళ్ళు వళ్ళేనా వచ్చేటట్టా రానట్టా:

శేషగిరి

వస్తారు. నేనిందాకా మళ్లీ చెప్పానుకూడాను. లక్ష్మీకాంతం మాట మట్టుకు అనుమానం

నారాయణరావు

ఏం వంట్లో బాగాలేదా.

శేషగిరి

ఎలా బాగుంటుంది. ఇంతమరీ బరితెగినమనిషిని ఎక్కడా చూడలేదు. మొన్న గందరగోళం విన్నారుగా.

నారాయణరావు

నేనేం వినలేదే. ఏదో నా పనిమీద నేను.

సాంబశివరావు

ఏమిటి మొన్న, ఆఁ అయిందీ: హరి వీడినితగలెయ్యా ఎంతపని చేశాడు.

శేషగిరి

అంతటితో అయిందీ మళ్ళీ నిన్న,

సాంబశివరావు

నిన్ననే మళ్ళీ నిజంగా దాన్నే. హరి వీడి మొహంమండా-

నారాయణరావు

పోనిద్దురూ వెధవగొడవా. శేషగిరీ, ఇదికొంచెం సాపు రాసి పెడుదూ.

సాంబశివరావు

చూడుబాబూ అదేదో, ఇప్పుడే క్షణంలో వస్తా ?

నారాయణరావు

అదేమిటి మీరు దాటేస్తున్నారు.

సాంబశివరావు

ఆబ్బెబ్బే. ఒక్క క్షణం మనవాడది రాసేలోపున వస్తాను. (అని నిష్క్రమిస్తాడు.)

శేషగిరి

పాపం. అయిదేసి నిమిషాలకోసారి ఇంటావిడ ఏమైందో అని ఖంగారు పడుతుంటాడు. ఖంగారుపడితే ఏమిలాభం, ఏం కాపలాకాస్తే ఏమి లాభం. అదుగో సభాపతిగారు వస్తు న్నట్లున్నారు. అయన ధర్మమా అని అవిడనుకూడా కొట్టుకు రాకుండా వచ్చాడు.

(గుమ్మంలో సభాపతిగారు ఎదురుకాగానే వారితో మళ్ళీ సాంబశివరావు లోపలికి వస్తాడు.)

సాంబశివరావు

ఇదుగో నయ్యా నారాయణరావూ. మన సభాపతి గార్ని తీసుకొచ్చాం.

నారాయణరావు

నమస్కారమండి. దయచెయ్యండి.

శేషగిరి

నమస్కారంసార్.

సభాపతి

ఆ. హ. హ్హ. (అంటూ నమస్కారాలందుకుంటాడు.)

నారాయణరావు

ఎందుచేతనా తమరు ఇంకా దయచెయ్యలేదనుకుం టున్నాం.

సభాపతి

ఎక్కడా తీరికలేక చస్తున్నాం. మీటింగులు. కమిటీలు-స్టేటుమెంట్లు. అభిప్రాయాలు. తెరవడాలు. ముయ్యడాలు ఒకటేమిటి. ఊపిరి తీసుకోనివ్వరు. ఏంచేస్తాం. దేశసేవకోసం ఈ శరీరాన్ని అర్పించిన తరువాత ఏమొచ్చినా తప్పదు. ఆఁ, మనవాళ్ళంతా వచ్చారా.

నారాయణరావు

ఇంకా అంతా రాలేదండి. ఈపాటికి వస్తూ వుంటారు. ఈలోపున తమరి చిత్తు తీర్మానాలు చిత్తగించాలి.

సభాపతి

నాకసలే దృష్టి సరిగాలేదు. ఆ చిత్తువి నాచేతులో పెట్టక పోతే కాస్త సాపురాయించక పోయినావూ.

నారాయణరావు

జాగ్రత్తగానే రాశానండి. చిత్తు అంటే Rough draft అని నా ఉద్దేశమండి.

సభాపతి

ఓహో అదా - నీ వుద్దేశమేదైతేవుందో అది స్పష్టంగా చెపుతూ ఉండమ్మో. అదెప్పుడూ మంచిది. ఆఁ మనం త్వరగా ముగించాలి. మళ్ళీ నాకు వేరే పనుంది,

నారాయణరావు

చిత్తం. అంతా ఏర్పాటు చేశానండి,

సభాపతి

ఏమిటోయా శేషగిరి. ఏమిటి విశేషాలు.

తమకు తెలియనివేమున్నాయండి.

సభాపతి

అవును కాని ఆ లక్ష్మీకాంతం సంగతి విన్నావా.

శేషగిరి

చిత్తం మహాదారుణంగా వుందండి.

సభాపతి

వాడి మాటేలావున్నా దానికేం పొయ్యేకాలమంట.

శేషగిరి

దానికే ఆశ్చర్యపోతున్నారు. నరసమ్మ మాటవింటే మీరు మరీ ఇదవుతారు.

నా॰ బశివరావు

మనవాడు Reuter కంటె ఎక్కువ విషయాలు తెలుసుకుంటాడు.

సభాపతి

అదికాదయ్యా పురాణపురుషా. Reuter కుమల్లే చెత్తాచెదారం కాకుండా అసలు విషయాలు గ్రహిస్తాడు.

నారాయణరావు

మనం మంచి Constitution ఒకటి Frame చెయ్యాలండి. నాకు కొన్ని సందేహాలుండి...

సభాపతి

నీకు సందేహంగా ఉన్నదల్లా నన్నడుగు. అరిటి పండొలిచినట్లు చెపుతాను. నాకు బోలెడంత అనుభవముంది.

సాంబశివరావు

సందేహమా అండి. తమకున్న అనుభవంలో సగం వయస్సులేదు మన కుర్రాళ్ళకు. ఆమాటే ఇందాకా నారాయణ రావుతో చెప్పాను.

సభాపతి

చూడమ్మా. ఇక్కడ కార్యక్రమం ఏదో త్వరగా అయిందనిపిస్తే....

నారాయణరావు

ఈవేళ కార్యం చాలా ముఖ్యమైనదీ అవసరమైనదీనండి. అలా నిమిషాలమీద కొట్టెయ్యడానికి వీలులేదండి.

సభాపతి

నీ కెందు కదంతాను. నేను తలుచుకున్నానంటే ఏపనేనా క్షణాలమీద ఎగరకొట్టేస్తాను. రాజ్యాలు రాజ్యాలు ఎగిరి పోతుంటే ఇదో పెద్ద ఇదంటావేమిటి వెర్రివాడవు. "మహాగజాః పలాయంతే మశకానాంతుకాగతిః', అన్నట్లుంది.

సాంబశివరావు

అహో—బాగా శలవిచ్చారు. తమరు శలవిచ్చినట్లు.

(ఇంతట్లో మరికొందరు సభ్యులు వస్తారు)

నారాయణరావు

మనవాళ్ళంతా వచ్చారండి. మనం మీటింగు ప్రారంభించ వచ్చు.

(సభాపతి శుభం అని ప్లాట్ ఫారం ఎక్కి—)

సభాపతి

మనం మీటింగు ప్రారంభించామన్నమాట. ముందు

కార్యక్రమం మనం ప్రార్థనతో ప్రారంభిద్దాం.

ఒక మహామ్మదీయుడు

ఈ సభలో అన్ని మతముల వారూ ఉన్నారు కనుక, మీ ప్రార్థన మా కంగీకారము కాదు కనుక, ప్రార్థనమాని కార్యక్రమం ప్రారంభించమని మా ప్రార్థన.

క్రైస్తవుడు

మా అభిప్రాయంకూడా అదే. లేదా సర్వ జనాంగీకారంగా వుండేటట్టు నేను ప్రార్థన చేస్తాను.

సభాపతి

అదేమీ వీలుండదు. మా ప్రార్థన వినడం ఇష్టంలేని వాళ్ళు చెవులు మూసుకొని, వారి ఇష్టమైన ప్రార్థన చేసుకోవచ్చును.

మహామ్మదీయుడు

అలాగైతే మేమిక్కడ ఉండం. (అని లేస్తాడు. అతనితో క్రైస్తవుడుకూడా లేచి ఇద్దరూ వెళ్లిపోతారు.)

సభాపతి

మతాంతరులు వెళ్ళిపోయారు. గనుక మనంప్రార్థన కానిద్దాం.

(అందరూ నిలబడతారు)

ఒకరు గీతంచదువుతారు

సుజలాం, సుఫలాం, మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం॥ వం దే।
శుభ్రజ్యోత్స్నాపులకితయామినీం
ఫుల్లకుసుమితద్రుమదళ శోభినీం.

సుహాసినీం, సుమధుర భాషిణీం,

సుఖదాం,వరదాం, మాతరం॥ వందే॥

సభాపతి

తరువాత కార్యక్రమం ఏమిటి నారాయణరావూ.

నారాయణరావు

మున్ముందు మనం ఆచరణ యోగ్యమైన నిర్మాణ కార్యక్రమం ఒకటి తయారు చెయ్యాలండి. అందుకు సంబంధించిన సభ్యుల సూచనలు ఇక్కడ పొందుపరచానండి.

వెంకట్రావు

రష్యాలోనండి ఇటువంటి ప్రణాళికలు మహచక్కగానూ వీలుగానూ సుళువుగానూ చేస్తారండి.

సభాపతి

నిజమేనమ్మా వెంకట్రావు. అది నాకు తెలుసును. ఆపద్ధతి కొంత అవలంభిద్దామనే ఇప్పుడు...

రామారావు

చైనాలో సన్యాటు సేను చచ్చిపోయిన తరువాతనండి,

సభాపతి

వారిని భూస్థాపితంచేసి గొప్ప గోరీ కట్టినట్టు విన్నాను.

సాంబశివరావు

ఆ సందర్భంలో శంఖుస్థాపనకో ఎందుకో తమర్ని ఆహ్వానించినట్టుకూడా జ్ఞాపకమండీ.

సభాపతి

హహ్హహ్హ. జ్ఞాపకముందీ.

నారాయణరావు

మనం అమెరికన్ మాడలు మీదను ఒక...

సభాపతి

ఏ Model అయినా సరే వప్పుకుంటానుకాని Ford model మట్టుకు తేవద్దని నా సలహా. అనుభవించినవాడిని కనుక చెపుతున్నా.

సాంబశివరావు

హఁ అనుభవంలోనూ ఇంతా అంతానా అండి.

కర్మవీరుడు

జై మహాత్మ గాంధీకీ జై. భరత్‌మాతాకూ జై (అంటూ కర్మవీరుడు ప్రవేశం.)

సభాపతి

వాడెవడయ్యా! పానకంలో పుడకలాగ. మధ్యనా గంధర గోళ మేమిటి.

నారాయణరావు

అయన కర్మవీరుడండి.

సభాపతి

ఏమిటీ! కర్మవీరుడా. ఏమిటాయన చేసేకర్మ. క్షురకర్మా

కర్మవీరుడు

పండిట్ జవహర్‌లాల్‌కూ జై...

నారాయణరావు

కాదండి దేశాభిమానం చేస్తూ వుంటాడండి.

సభాపతి

అంటే ?

నారాయణరావు

ఇలాగే మీటింగులలో మహాత్మ గాంధీకి వారికి జై అనడం దేశాభిమానం పద్యాలు చదవడం- జండాపుచ్చుకు తిరగడం.

సభాపతి

ఓహో-అలాగేం...

కర్మవీరుడు

గీతం...

ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా యెవరేమనరయిన
పొగడరానీతల్లి భూమి భారతిని
నిలుపరానీజాతి నిండుగర్వమ్ము
లేరురాయిటువంటి భూదేవియెందు
లేరురామనవంటి ధీరులింకెందు.

సభాపతి

వీడు పద్యాలు చదువుతూ కూచుంటే మన మీటింగె లాగ (కొంచెం గట్టిగా) అయితే మనం తరవాయిపని...

వెంకటరావు

రష్యాలో ఆ ఐదేండ్ల Plan ఉన్నదే అండి.

సభాపతి

రష్యాలో గనుక ఐదేండ్లు పట్టిందిగాని. నేనైతేనా అలాటివి ఐదుఐదేండ్ల Plans అయినా ఐదు నిముషాల్లో తయారుచేసి అమలులో పెడతాను, మనం ముందు ఆర్ట్ సెక్షన్ ఒకటీ లిటరరీ సెక్షన్ ఒకటీ...

వెంకటూర్రావు

ఆర్ట్ అన్నప్పుడు మాస్కో ఆర్ట్ థియేటర్ చూచితీరాలండి. వెధవ తాజ్ మహాల్ అనీ ఇదనీ మనంగొప్ప చెప్పకోడమే కానండి. దానిముందు ఇవన్నీ దిగతుడుపుకాదండీ.

కర్మవీరుడు

గీతం—

దేశమంటే యెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరులచెమటను తడిసినమూలం
ధనంపంటలు పండవలెనోయ్!

రామారావు

"గ్రేట్ వాల్ ఆఫ్ చైనా" ముందు మన హిమాలయాలు కూడా ఎందుకూ పనికిరావు.

సాంబమూర్తి

ఏదన్నా డబ్బుంటే ఎన్నిపనులేనా చెయ్యొచ్చు. ధనమూలమిదంజగత్తన్నాడు.

శేషగిరి

డబ్బంటే జ్ఞాపకంవచ్చింది. ఈమధ్య మనబోర్డు ప్రెసిడెంటుగారికి తడి బాగా తగిలింది సుమండీ.

రామారావు

తడన్నప్పుడు ఆ ఖూనీకేసులో జడ్జీగారికి తగిలించే తడి ఇంకనాయన పించను పుచ్చుకుని యావజ్జీవం హాయిగా ధర్మాన్ని గురించీ న్యాయాన్నిగురించీ ఉపన్యాసాలిస్తూ కాలక్షేపం చెయ్యవచ్చు.

సభాపతి

ఏమిటో దానికో పెద్ద బ్రహ్మాండం బద్దలయిం దంటారు. పాశ్చాత్య దేశాలలోమట్టుకిలాటివి లేవా. ఒక్కొక్క మంత్రి, కార్యదర్శి తన ఉద్యోగం చాలించుకునేనరికి ఎంతెంత ఆస్తులు నంపాదిస్తాడు. అవన్నీ ఎక్కడనుంచి వచ్చాయంటావు.

వెంకటాద్రివు

రష్యాలో మట్టుకు లంచమనేది ఎక్కడా—

రామారావు

చీనాలో మట్టుకు.

వెంకటాద్రివు

చీనా–వెధవచీనా--నల్లమందు బిగించి, పట్టుగుడ్డలమ్ముకునో పళ్లుకట్టుకుంటూనో కాలక్షేపంచేసే ముండావాళ్లు, వాళ్లూ ఒకజాతీ, వాళ్ళకూ ఒకనీతీ అంటావేమిటి. ఇందాకటినుంచీ చూస్తున్నాను, ఈ వెధవప్రాచ్యదేశాలకి నీతేమిటి. నీతన్నా మంచి అన్నా, సృష్టిలోఎక్కడేనా ఉన్నదీ అంటే ఒక్క

రష్యాలో తప్ప మరోచోటఎక్కడాలేదు. ఉండదు. ఉండడానికి వీలులేదు. చీనాటచీనా—నయం ఇండియా అన్నావు కావింకాను.

కర్మవీరుడు

మహాత్మా గాంధీకీ!

(అందరూ జై.)

నారాయణరావు

అయ్యో వీడిని తగలెయ్యా, మళ్ళీ లిష్టంతా యాకరు పెడతాడు కాబోలు.

సభాపతి

ఏమిటయ్యా అగోల: మంచి సెన్సేషనల్ ప్రాబ్లెమ్ను డిస్కస్ చేస్తుంటేను.

కర్మవీరుడు

ఆంధ్రమాతకూ జై! ప్రజలను ఉద్రిక్తులనుగా చెయ్యడం నాపనండి క్షమించాలి.

ఇమ్మెగ గాకుళమ్ము మొదలీవరకుంగల
యాంధ్రపూర్వ రాజ్యమ్ముల పేరుచెప్పిన
హృదంతర మేలోచలించిపోవు
నార్ద్రిమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని
ఎన్ని జన్మమ్ములు గాగనీతనువునన్
బ్రవహించునోయాంధ్రరక్తముల్!

-విశ్వనాథ.

జై మన సభాపతిగారికీ జై!

నారాయణరావు

తమకేవో తొందరపనుందని తెలవిచ్చారు. అందుచేత మనం త్వరగా—

సభాపతి

ఉండవయ్యా ఒకటే హడావిడి. వెధవపనులు ఏవో ఒకటి ఉంటూనే ఉంటాయినాకు. ఇటువంటి అత్యవసరమైన పనొచ్చినప్పుడు మిగతావన్నీ మానుకుంటాం మరేమి చెయ్యం.

నారాయణరావు

మనం ముందు సర్వజనాదరణీయమైన కాన్స్టిట్యూషన్ ఒకటి తయారుచెయ్యవలసిన బాధ్యత మనమీద నున్నదండి.

వెంకటావు

తమరు చూచారో లేదో కాని రష్యన్ (Constitution) ఉన్నదే అండి ఏమి పర్ఫెక్ట్‌గా ఉంటుందండీ.

సభాపతి

వెర్రివాడా! నేను చూడక పోవడమేమిటి. ప్రపంచంలో అన్నీ సోవియట్, నాజీ, అమెరికా New Deal వగైరా అన్నీ 1914 లోనే కాచి వడపోసిన ముండావాడిని. ఆ విషయం నాకు విడిచిపెట్టు. అరగంటలో తయారుచేసి పారేస్తాను.

నారాయణరావు

సర్వజనాంగీకారంగా ఉండాలండి.

సభాపతి

నేనుచేసిన పనున్నదే సర్వజన— కాదు— సర్వలోకాంగీకారంగా ఉండి తీరుతుంది. నీకా సందేహం అక్కరలేదు.

సాంబమూర్తి

సందేహమాండి.

సభాపతి

విన్నావా నారాయణరావు.

నారాయణరావు

Chinese Con....

వెంకటరావు

అదుగో మళ్ళా చైనా అంటాడు. ఈ మాటు చైనా అన్నావంటే మాటదక్కదబ్బాయి. అసలు నీకేం తెలుసునని చైనా సంగతి....

రామారావు

నీకు రష్యాసంగతిమాత్రమేం తెలుసునేం...

వెంకటరావు

నోరుముయ్యి. అనవసరపు పేలాపన పేలకు. మరి మేం కమ్యూనిష్టులం తెలుసా. రష్యాలో ఎక్కడ ఏక్షణంలో ఎవడు ఏంచేస్తున్నా మాకు ఆ ఉత్తరక్షణం తెలిసి తీరుతుందేమను కున్నావో ?

రామారావు

కొయ్యి !

వెంకటా్రివు

పైకిరా! ఆ కోతలేమిటో తెలుస్తాయి.

సాంబమూర్తి

మనపూర్వులందుకనే మల్లయుద్ధం చాలా గొప్పదన్నారు. ఎటువంటి వివాదాంశమైనా క్షణంలో తేలిపోతుంది.

కర్మవీరుడు

గీతం.

అమరావతీ పట్టణము బౌద్ధులువిశ్వ
విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజవీరలాంఛనముగ
బలుశస్త్రశాలలు నిలుపునాడు
విద్యానగర రాజవీథులంగవితతు
పెండ్లి పందిళ్ళు కప్పిరించునాఁడు
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయ స్తంభ మెత్తించునాడు
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్యదీక్షాసుఖ స్ఫూర్తి తీవరించె
నామహావేశ మర్థించి యాంధ్రులార
చల్లుఁడాంధ్రలో కమున నక్షతలు నేఁడు

నారాయణరావు

అయ్యో వీడిల్లు వల్లకాడుగానూ. మళ్ళీ తగులు కున్నా డోయి బాబూ. ముందు మన కార్యక్రమం—

సభాపతి

మనం ఒక్కొక్క డిపార్టుమెంటుకు ఒక్కొక్క సబ్ కమిటీ ఏర్పాటుచేదాం. తరువాత ప్రతి తాలూకాకీ ప్రతి ఫిర్కాకీ ప్రతిగ్రామానికీ, బ్రాంచీలు ఓపెన్ చేద్దాం. తరువాయి సంగతులు మళ్లీ మీటింగులో చర్చిద్దాం. ఇదంతా రిజిష్టరులో రాయమ్మా నారాయణరావు. ఏమంటావు వెంకట్రావు.

వెంకట్రావు

ఇప్పుడు Quorum లేదండి. అందుచేత నిప్పుడు మనం ఏం చెయ్యడానికీ వీలులేదండి.

రామారావు

కోరము మాట అటుంచి ఈ మీటింగ్ Ultra vires అని నా అభిప్రాయమండి. ఎందుచేతనంటే...

వెంకట్రావు

నీ అభిప్రాయం ఎవడికి కావాలోయి, బోడి అభిప్రాయం.

రామారావు

చూచారండి సార్ నిర్హేతుకంగా...

సభాపతి

అయితే పోనీ మరో రోజుకు వాయిదా వేద్దాం.

నారాయణరావు

ఎన్నిసార్లుసార్. వాయిదాలు. ఒకళ్ళకూ సిన్సియారిటీ కాని శ్రద్ధకాని లేదు.

సభాపతి

తొందరపడకు, అందరికీ అన్నీ ఉన్నాయి. ఉంటే మట్టుకు ఏం చెయ్యమంటావు. నువ్వు సరదాపడ్డావని సభ పెట్టాం. డబ్బు కావాలంటె వసూలు చేశాం. ఇంక మనం చేసేదేముంది. ఏమన్నా ఉంటే సావకాశంగాచేదాం. ఇవేం సద్యోగర్భాలయే రోజులు కనుకనా!

నారాయణరావు

అంతే నంటారా. సభ స్థాపించగానే మనపని అయిందంటారు.

సభాపతి

అంతే. అంతకంటె ఏముంది. కావలిస్తే రేపు గవర్నరు గారొచ్చి నప్పుడు సన్మానపత్రం సమర్పించి డిప్యుటేషను wait చేదాం. మనకు provin. leg. లోనూ Central లోనూ Representation కావాలని ప్రెస్‌చేదాం. ఇంకా కావలిస్తె మనకో 'పాకీస్థాన్' లాంటిది కావాలందాం. చావుకు పెడితేనేకాని లంఖణాలకు తేలదు. ఏమంటావు- సరేనా.

నారాయణరావు

చిత్తం. అలా అయితే నేను రాజీనామా దాఖలుచేస్తానండి మనం ఏదో పనిచేస్తామనుకున్నాంకాని...

సభాపతి

శుభం. ఆవిషయం మళ్ళీ మీటింగులో ఆలోచిద్దాం. నాకు నాలుగురోజులు ముందుగాచెప్పం. మరోపనులేమీ లేకుండా చేసుకుంటాను. ఏంపురాణరుషా—నిష్క్రమిద్దామా....

సాంబమూర్తి

చిత్తం—తమరు వెనుకనాటకాల్లో రాజువేషాలు వేసేటప్పుడు ఏమి దర్జాగా నిష్క్రమించేవారు.

సభాపతి

హహ్హహ్హ — జ్ఞాపకంవుంది. మనలోవుండే విశేషమే అది. మనప్రభువుల దగ్గర నేను కనిపెట్టిన రహస్యం అదే. ఎటువంటి క్లిష్ట పరిస్థితులలోనుంచేనా బహు దర్జాగా నిష్క్రమిస్తాను.

కర్మవీరుడు

తనగీతి యవనజాతిని పాటకులనుగా
దిద్దివర్ధిల్లిన తెనుఁగువాణి,
తనపోటులు విరోధి దండంబులకుసహిం
పనివిగా మొనసిన తెనుఁగుకత్తి
తనచందములు ప్రాంతజనుల కభిరుచివా
సననేర్పు నలరిన తెలుగురేఖ
తనవేదికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయజెలంగిన తెనుగుభూమి

అస్మదార్ద్రి మనోవీధి నావహింప
జ్ఞప్తికెలయించుచున్నాడ, చావలేదు,
చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర
హృదయములుచీల్చిచదువుడో సదయులార

ఆంధ్రమాతకూ జై !!!

# వారసత్వం

## పాత్రలు

| | |
|---|---|
| వెంకట్రావు | పాఠశాలలోని ఉపాధ్యాయుడు |
| నారాయణబాబు | వెంకట్రావు స్నేహితుడు తోటి ఉపాధ్యాయుడు |
| రాజ్యం | వెంకట్రావు భార్య |
| రమణారావు | రాజ్యం పినతండ్రి దేశాంతర వాది. |

స్థలం—వెంకటావ్రు ఇంట్లో మధ్యసావడి.
కాలం—సాయంకాలం, అయిదుగంటలవేళ.

రాజేశ్వరి కుట్టుపని చేసుకుంటూ కూర్చుంటుంది. లోపల నుంచి చెంబులూ, గ్లాసులూ గిరవాటేస్తున్నచప్పుడు 'అమ్మా' అన్న పెద్ద నిట్టూర్పు. ఆ నిట్టూర్పులో నారాయణబాబు ప్రవేశం.

నారాయణబాబు

అదేమిటమ్మా రాజ్యం. వెంకట్రావుకేమైనా వంట్లో...

రాజ్యం

బాబుగారూ సమయానికే వచ్చారు. జబ్బూలేదు ఏమీ లేదండి-

(లోపలనుంచి మళ్ళీ పెద్దమూలుగు)

నారాయణబాబు

ఏమిటమ్మా మరి అంత అలా—

రాజ్యం

ఏమీ లేదు బాబుగారూ. మీరేం ఖంగారు పడకండి. నిక్షేపంలా ఉన్నారు. మధ్యమధ్యను అలామతిపోతూ ఉంటుంది ఆయనకు. ఏంచెయ్యడానికీ తోచకచస్తున్నాను.

(లోపలనుంచి మళ్ళీ పుస్తకాలు గిరవాటేస్తున్న చప్పుడు)

రాజ్యం

వింటున్నారాబాబూ, మీరేనా కాస్తచెప్పి ఈ గొడవ మానిపిస్తేనేకాని నేనీ ఇంట్లో ఒక్క క్షణం కాపురంచెయ్యలేను.

నారాయణబాబు

**ఏమిటమ్మా! అసలు సంగతేమిటి.**

(లోపలినుంచి పద్యం.)

కనికరములేని దుఃఖవేదనల సెగల
పొగల వెలిజిమ్ము వలపుటూర్పుల భరమ్ము
మోసికొని, నేనె నాలోన మూల్గుకొనుచు
గాలివోలె సమస్తావకాశములను
నెడతెఱిపిలేక తిరుగాడిబడలినాను
దారుణపు జీవితంపు టెడారిలోన
తీరని పిపాస నే దారి తెన్ను లేక
నేనె నాదుఃఖ బాష్పశోణితలహరుల
నే విసుగు వేసటలు లేక ద్రావినాను
కడుపుగాల్చెడు మండుటాకటను గేళి
కోర్కెలొండొంటిని గ్రసించు కొనెడుకొలది
నొడలెఱుంగక కాలమృత్యువును నేనె
కొంచెముగ గొంచెముగ కబళించినాను.

(విచారంలోకిమారిన పెద్దనిట్టూర్పు.)

రాజ్యం

**ఇదీవరస.** ఏమనిచెప్పను బాబుగారూ, ఏమీతోచనప్పుడు **తినికూ**చుని ఇలా హంగామాచేస్తారు. ఇంట్లో **ఉన్న**చెంబులూ

గళానులూ గిరవాటెట్టడం, కుర్చీలూ బల్లలూ విరగ్గొట్టడం. ఈ దిక్కుమాలినపద్యాలుచదవడం, ఏడుస్తూకూచోడమూను. శలవురోజు వచ్చిందంటే హడిలిచస్తున్నాను.

నారాయణబాబు

ఎందుకమ్మా అంతభయం. నిన్నేమన్నా—

రాజ్యం

అబ్బెబ్బే ఏమాటకామాటే అనుకోవాలి నన్నేమి అంటున్నా రనికాదు.

(మళ్ళీ లోపలనుంచి పద్యం. నిట్టూర్పు)

నాకుప్రశాంతి లేదు, కఠినమ్ముగ శూన్యమునందు
క్రుంగి చీ
కాకయు పోయె నాబ్రతుకు, కన్నులువిప్పిన మూసి
కొన్న బా
ధా కలుషమ్ములాశలెడదస్ విదళించు నా
నిస్సహాయతా
వ్యాకులశోకగీతులె యహర్నిశమున్ విన
వచ్చు రోదసిన్
నేనునిశాధి నొంటిశయనించి గభీరతమో
బ్ధిసంకులో
ర్మికనికరమ్ములుం బులకరింపగ నాతుదిలేని
సైపగా

రానిప్రవాసజీవనభరమ్ముఁ స్మరించుచు రక్త
భాష్పముల్
సోనలుఁ గారనేడ్చెదను లూకవిలోకనముల్ చెమ
ర్పఁగన్
నాయెదగక్కఁ ప్రపంచ మఃనస్ మృగతృష్ణల యింద్ర
జాలమై
పోయె, గలంతనిద్ర గను మూసితినేని మనోహరా
కృతి
చ్ఛాయయేదోకనంబడుచు స్వప్నములం, బవ
లెల్లదుఃఖముం
బాయనియట్టి నాహృదయ మర్మములన్ మెలి
వైచితుంపెదున్-
నాకిపుడెల్ల వేళల వినంబడుచుండెనకాలమృ
త్యుఁగ
ర్జాకలితాట్టహాసముల సందడులందునప్రేమ
విహ్వలా
శాకరుణమ్ములే గుసగుసల్, మరి చైత్రిశు
భప్రభాతవం
శాకలగాన మీశిశిర జీవనమందిక లేనెలేదొకో

రాజ్యం

అనకపోతేమట్టుకు ఊరికేపుణ్యానికి తినికూచుని ఎందుకు చెప్పండి ఈపద్యాలూ ఏడుపులూ గందరగోళమూనూ అయన-ఆకవి-ఎవరో ఈ ఏడుపుగొట్టు పద్యాలు నన్నేడిపించ డానికి రాసినట్టుందికాని—పోనీ ఆరాసిన అయన అస్తమానం ఇలా ఏడుస్తూ కూచుంటాడండీ— కూచుంటే ఆ పెళ్ళాం సహించి ఊరుకుంటుందా— అయనకు లేని ఏడుపు మధ్యను ఈయనకెందుకంట—

నారాయణబాబు

వాళ్ళఏడుపంతా ఒక్కసారి పద్యంలో వెళ్ళబోసుకున్నారు. తీరిపోయింది. దానికేంకాని, పోనీ ఎందుకితను ఇలాబాధ పడుతున్నాడో ఒక్కసారి నెమ్మదిగా కనుక్కోక పోయినావు.

రాజ్యం

అడిగానండీ, అడక్కనా-అడుగుతే నాకేమైనా సమాధానం చెపుతారా ఏమన్నానా.

నారాయణబాబు

ఏమంటాడు.

రాజ్యం

ఏమిటో అయినబాధ పడుతున్నారట, అయినబాధ అర్థం చేసుకునేవాళ్లు ఎవళ్లూలేరట.

నారాయణబాబు

ఏమిటాబాధ.

రాజ్యం

ఏమో! అదేనాకూ అర్థంకాక చస్తున్నాను.

నారాయణబాబు

రంభలాంటిభార్య, రత్నాలులాంటి పిల్లలూ, ఏదో - చిన్న దైనా ఉద్యోగం, కొద్దోగొప్పో వెనకకొంత ఆధరవు - ఇన్నీ ఉంటే ఇంకనేంబాధమ్మా- ఏమి లేనివాళ్ళంమేము నిక్షేపంలా ఉంటేను.

రాజ్యం

ఆయనకివేవీ అక్కరలేదుట. ఈసంసారంమీద అసహ్యం పుడుతోందట.

నారాయణబాబు

ఏమిటంతవైరాగ్యానికి కారణమేమిటో- కొంపతీసి ఆశ్రమ స్వీకారం చెయ్యావలెననే ఆశబయలుదేరలేదుకద!

రాజ్యం

అబ్బెబ్బే అదేంలేదు. ఆశ ఉన్నదికాని-ఆశ్రమంమీదకాదు, అర్థంమీద.

నారాయణబాబు

దానికే - దైవానుగ్రహంవల్ల లోటులేదు కాదూ!

రాజ్యం

ఉన్నదిచాలదట, ప్రపంచంలో తమరొకరుతప్ప అందరూ సుఖపడుతున్నారట. తనకు ఎందుకూ ఈవెధవ సంపాదన చాలడంలేదట.

నారాయణబాబు

పోనీ అయితే వేరేవ్యాపారం ఏమైనాపెట్టుకుని సంపాదించుకోకూడదూ.

రాజ్యం

అదీపనికిరాదుట మళ్ళీవి, ఊరికేరావాలట, అందరికీ ఊరికేవస్తూందిట. అపైస మాపినతండ్రి ఇంకాబ్రతికిఉండడ మేమి తమకు త్వరగా ఆడబ్బురాకపోవడమేమని అయనదుగ్ధ.

నారాయణబాబు

అదేమిటి!

రాజ్యం

మీరెరుగరా ఏమిటి! నాకుపినతండ్రి ఒకాయన ఉన్నాడు రమణారావుగారని. ఆయన నాచిన్నప్పుడే దేశాంతరం వెళ్లిపోయాడు. పెళ్లిచేసుకోలేదు. అక్కడ వ్యాపారంచేసి చాలా డబ్బుసంపాదించాడట.
ఆయనకు చిన్నప్పటినుంచీ నేనంటే చాలాఅభిమానం.

నారాయణబాబు

అలాగా! నేనెప్పుడూ వినలేదు, మళ్ళీ ఎప్పుడూ రాలేదూ ఇక్కడకి.

రాజ్యం

లేదు. కానినాపెళ్ళికి చాలాబహుమతులూ, వస్తువులూ పంపించాడు. మళ్లీమాపెద్దవాడు పుట్టాడనివిని చాలానంతోషించి వాడికి ఏవేవోపంపించాడు. వాడికి తనపేరు పెట్టవలసిందనీ, తన ఆస్తంతా నా పేరవ్రాశాననీ, అందులో సగం మాపెద్దవాడికి ఇవ్వవలెననీ విల్లురాశాడట. అప్పుడప్పుడు నాకు ఉత్తరాలు రాస్తూఉంటాడు. ఎప్పుడేనా ఏదేనా ఇబ్బందిగా ఉందంటే కాన్త సహాయపడుతూంటాడు.

నారాయణబాబు

అలాగా! మరింకనేమమ్మా!

రాజ్యం

అది చాలదట. రోజురోజూనన్ను రాసిడబ్బు తెప్పించమని చంపుతారు. బాగుంటుందా బాబుగారూ మీరే చెప్పండి. ఆయన ఒక్కడేకద. మనం పిల్లలతోటి ఇంత ఇబ్బందిపడు తున్నాంకదా. ఆయన అవసరానికేదో కాస్త ఉంచుకుని తక్కిన డబ్బంతా ఇక్కడికి పంపకూడదా అంటారు. ఇంత అన్యాయం ఎక్కడేనా ఉంటుందా.

నారాయణబాబు

అన్యాయమా మరీ అన్యాయమూ. ఎంతమాట. ఆయన అక్కడికీ ఏదో తోచిన సహాయంచేస్తూనే ఉన్నా డంటోంటివి; ఏమిటింత ఇలా అయిపోయాడేమిటి తను. ఇన్నాళ్ళనుంచీ ఊరికే ఆధునిక కవిత్వంమీద అభిమానమనుకున్నా కాని ఇంత అధ్వాన్నంగా తయారయ్యాడనుకో లేదు.

రాజ్యం

ఈ పద్యాలతోటే వారి పుట్టిముల కొచ్చిపడింది బాబూ. అస్తమానం ఆ దిక్కుమాలిన పద్యాలు చదవడం, ఆయాన పడడం కంటతడి పెట్టుకోడం నిక్షేపంలా ఏదో ఇంట్లోకూచుని పిల్లలముందు ఏంబాగుంటుందిచెప్పండి. తమకేమిలోటొచ్చిం దని; సాటివాళ్ళ కంటె తమరేం తీసిపోయారు. నేనన కూడ దుకాని, తమకు ఎక్కడ ఏమి లోటొచ్చిపోతుందో ఏమి మన స్సు ఇబ్బంది పెట్టుకుంటారో అని నమ్ముతారో నమ్మరో, వెయ్యికళ్ళతో కనిపెట్టి సంసారం ఈదుకొస్తున్నాను.

నారాయణబాబు

అయ్యో కాదటమ్మా—ఎంతమాట నమ్మకపోవడంకూడానా వాళ్ళతోనే చూడడంలేదుకనుకనా. నిజానికి నీవంటి ఇల్లాలు ఇంట్లో ఉంది కనుకనే అతను ఏ ఇబ్బంధీ పడకుండా ఏ బాద్యతా వహించ నక్కరలేకుండా హాయిగా సుఖపడుతు న్నాడు. అతన్నిచూచి అసూయ పడేవాళ్ళెంతమంది. తన సుఖం తను తెలుసుకులేకుండా ఉన్నాడుకాని ఇంత అదృష్ట వంతుడు మాలో మరొకడు లేడని మేము అస్తమానం అను కుంటూ ఉంటాం.

రాజ్యం

మీరు అయనతోటి ఒక్కమాట చెప్పాలి. ఈవరస ఏం బాగుంది కాదని. మీరు పెద్దలు మీ మాటంటే అయనకూ ఎంతో గౌరవం.

నారాయణబాబు

అయ్యో అలాగేనమ్మా చెప్పడానికేమి. కాని, ఇలాటిదానిలో నేను పైవాడిని ఎలా కలుగచేసుకోడం,నా సంసారంగొడవ నీ కెందుకంటే నేనేంకావలిసింది. ఒట్టప్పుడు ఎంత గౌరవము న్నా ఇలాటివాటిలో....

రాజ్యం

పరవాలేదు బాబుగారు. మీరేం సందేహించకండి.

వెంకట్రావు

రాజా ఈ మాటేనా నా ఉత్తరానికి జవాబులేదుకాదో అ ముండా కొడుకు ఉన్నాడో ఊడాడో (అంటూ వెంకట్రావు ప్రవేశం. నారాయణబాబుని చూచి) ఇదుగో నారాయణబాబు

గారొచ్చారే, ఎంతసేపయిందండీ వచ్చి. రాజా చెప్పావుకావేం వీరొచ్చినట్టు—

రాజ్యం

ఏం చెప్పినా మీరేమన్నా వినిపించుకునే స్థితిలో ఉన్నారు కనుకనా మీ పద్యాలలోనూ మీ విచార సాగరంలోనూ మునిగి ఉంటే ఎవరువచ్చిందీ పోయిందీ మీకేం తెలుస్తుంది. మీకేంకావాలి. (అని లోపలికి పోతుంది)

వెంకట్రావు

రండి నారాయణబాబూ కూర్చోండి. చాలా సేపయిందా వచ్చి?

నారాయణబాబు

ఏదో పదినిమిషాలయింది. కాని, ఏమిటో హడావిడిలో ఉన్నట్టున్నావు.

వెంకట్రావు

హడావిడేముంది, ఏమీ లేదే.

నారాయణబాబు

ఏదో లోపలనుంచి చప్పుళ్ళూ, పద్యాలూ, నిట్టూర్పులూ వగైరా చాలా వినపడ్డాయి.

వెంకట్రావు

ఏదోలెండి. మధ్యమధ్య నాకు Depression వస్తూఉంటుంది.

నారాయణబాబు

అంటే వంట్లో బాగాలేకనా.

వెంకట్రావు

అబ్బే! అదేంకాదండి.

నారాయణబాబు

మరి-

వెంకట్రావు

అదో Mood

నారాయణబాబు

ఏమిటో నాకే Moods ఏమీ అర్థంకావు, చెప్పొద్దూ

వెంకట్రావు

కాకపోవచ్చు. మీదంతా అదో పద్ధతి.

నారాయణబాబు

అంటే-

వెంకట్రావు

మీకు ఒడుదుడుకులేమీలేవు. వాంఛలేమీలేవు. ఉన్నాలేనట్టు నటించగలరు. కాలపమీద పడవలా వెళ్ళిపోతుంది. మీ జీవితం.

నారాయణబాబు

మీది మట్టుకెందుకు వెళ్లదు అలాగ.

వెంకట్రావు

ఎందుకు వెళ్ళదంటే ఏమి చెప్పను. నా దురదృష్టమే నుకోవాలి. చిన్నప్పటినుంచీకూడా నేను పూర్వపు బాటలో నడవడం నాకిష్టముండేదికాదు. నేను ఈ కాలపు వాడిని. ఈ నాటి ఆలోచనలూ, కోరికలూ, ఆశయాలూ నా ప్రతిరక్త

నాళ్ళంలోనూ పరుగులెడుతూ ఉంటాయి. ఇప్పుడున్న పద్ధతులు నాకేమీ నచ్చవు. మనఖర్మమనుకుని వాటికి లొంగి, బానిసనై ఉండడం నాచేతకాదు. అది దాస్యలక్షణం. దానుడి ననిపించుకోడం నాకు ఏమాత్రమూ గిట్టదు.

నారాయణబాబు

అందుకని ఏమంటావు.

వెంకట్రావు

ఏ మంటాను. ఉన్నదానితో అసంతృప్తి. లేనిదానికోసం తీవ్రవాంఛ. అందుకని అస్తమానం జీవితంలో అశాంతి.

నారాయణబాబు

ఈ జబ్బుకి మందేంలేదా ?

వెంకట్రావు

లేకేం. ఉంది. ఎటొచ్చీ నాకు అందుబాటులో లేదు. ఈ కాలంలో నమస్త వ్యాధులకూ దివ్యౌషధం ధనం. అదిఉంటే అన్ని వాంఛలూ తీరుతాయి.

నారాయణబాబు

వ్యాధి ఫలానా అని తెలిసి, దానికి చికిత్సకూడా తెలిసి ఉంటే ఇంకా బాధపడడ మెందుకు.

వెంకట్రావు

మందుకోసమే ఇప్పుడు పడుతున్న బాధ. ఈవేధవ ఫేష్టరీలో మనకు, కనుబొమ్మమీద వెంట్రుకలాగ ఎదుగు బొదుగు లుండవుకదా. వాళ్ళు కడిగి ఇచ్చిన జీతపురాళ్లతో కాలక్షేపం చెయ్యడం నా చేత కావడంలేదు. పోనీ ఇది మానిమరొకటేమైనా చూసుకుందామంటే మనమెందుకూ పనికిరాం.

నారాయణబాబు

అందుకని మనకామాత్రం స్వస్వరూప జ్ఞానం ఉన్నది కనుక ఊరికే బాధపడేకంటె ఉన్నదానితో తృప్తిపడడం మంచిది కాదూ!

వెంకటరావు

మంచిదే! కాదన్నవారెవరు. "ఫలములు చాలుజీవికకు బానము సేయజలంబు చాలు వల్కలములుచాలుకట్టుటకిలా తలముల్ శయనింపచోట" నన్నసంగతి తెలియకనా. ఇలాటి వేదాంతాలు.చాలాతెలుసును. తెలియకకాదు. కాని చెప్పాను కాదూ నేనలా సంతృప్తిపడి ఊరుకోలేనని, సృష్టిలో ఇంత సౌందర్య ముండగా ఇన్నిరకాల భోగ్యపదార్థములుండగా ఎలానోరు మూసుకూరుకోవడం. పోనీమనకు గతిలేదు. లాభం లేదు అనేనిరాశేనా కలుగుతే మనఖర్మం అనుకుని ఒక్కసారి నీళ్లువదలుకోవచ్చు.

నారాయణబాబు

అయితే వేరేఆశ ఏమైనా ఏడిపిస్తోందా ఏమిటి.

వెంకటరావు

అదేవచ్చినచిక్కు. నాకు పినమామగారు ఒకాయిన ఏడిశాడు కానైతే నేనెప్పుడూ చూడలేదుకాని ఆయన ఏదో నన్నేడిపించ డానికే పుట్టినట్టున్నాడు. ఆయనబ్రహ్మచారి-బోలెడంత సంపాదన. ఖర్చు ఆయేమార్గంలేదు. పోనీఆయినకేభ మనకెందుకని ఊరుకునేవాళ్ళం. అలా ఊరుకోనివ్వక అయిన ఆస్తిఅంతా రాజాకీ, మాపెద్దాడికీ రాశానని ఉత్తరం మధ్యమధ్య నేదోకొత్త మామొహాన్నిరాలుస్తూండడం దానితో లేనిపోని ఆశలు బయలు దేరినాయి.

వెంకటరావు

అయితే ఇంకనేం-బాగుంది.

నారాయణబాబు

బాగేమిటండీ నాబొంద. అయిన కొంచమించు మించుగా నాఈడువాడు. అయిన చచ్చేదెప్పుడు, ఆ ఆస్తిమాకు వచ్చేదెప్పుడు. మేంఅనుభవించేదెప్పుడు.

నారాయణబాబు

అయితే నువ్వు అయన్నిప్పుడు, నీ సౌకర్యంకోసం అర్థంటుగా అవతారం చాలించమంటావు! మంచి పెద్ద మనిషివే!

వెంకట్రావు

నేనంత దారుణం కోరడం లేదుకాని, కొంత మా మొహాన్ని ఇప్పుడే తగలెయ్యా కూడదా అంట.

నారాయణబాబు

అది కాస్తా నువ్వు తగలేస్తా వేమోనని అయనభయం కాకూడదూ.

వెంకట్రావు

నేనెలా తగలేస్తే అయనకెందుకూ అయన Duty అయన చెయ్యాలికాని.

నారాయణబాబు

కష్టపడిసంపాదించినవాళ్ళకు డబ్బు విలువతెలుస్తుంది, నీ బోటివాడు తేరగావచ్చిందికదా అని తగలేస్తుంటేచూచి ఊరుకోలేరు. అదలాఉంచి నువ్వెందుకాడబ్బుకోసం ఆసించడం, నీకేమిలోటు ఏదో ఒక సుఖమైన ఉద్యోగమా, పైన

మరి కాస్త సంపాదనా, అ పైన కొంత ప్రతార్జితమూ: ఇవన్నీ జాగ్రత్తపెట్టి నీకేలోటూ రాకుండా వెయ్యికళ్ళతో, కన్నతల్లిలా కనిపెట్టే కళత్రమూ: పళ్ళులాంటి పిల్లలా! ఇవేవీ చాలక నీకి అశాంతా: విచారమూ.. జీవితం నరకమూ- ఎందుకొచ్చిన కబుర్లయ్యా ఇవి, ఇందులో అర్థమేమైనా ఉన్నదా.

వెంకట్రావు

ఏమీ ఎందుకులేదు. జీవితమంటే తిండి, పెళ్ళాం, పిల్లలూనా. ఇంకేమీలేదు. గోచీకిపెద్ద, అంగోస్త్రానికిచిన్న అయిన అస్తులూ, సంపాదనలతో తృప్తిపడడం ఎలాగ. రెండుపూటలా భోజనంతప్పమరేంకావాలన్నా దరిద్రమా- నేనుఎంతోప్రేమించే భార్యనూ బిడ్డలనూ అలంకరించుకుందామంటే దరిద్రమా- నా సౌందర్యతృష్ణ తీర్చుకోడానికి చక్కని చిత్రములు కొనుక్కుందామంటే దరిద్రమా—శుభ్రమైన కుర్చీలూ బల్లలకూ మొహంవాసా. అఖరుకు చక్కని తివాసీలు కాని చాపలుకాని, దేనికీలేని, చాలని సంపాదనా ఆ స్త్రీ ఎందుకండీ ఏడవను.

నా ా యణబాబు

అవీలేక ఏడ్చేవాళ్ళు ఎంతమంది బాబూ- ఉండడానికి ఎక్కడికీ! నాకంటె మరొకడు గొప్పవాడు, వాడికంటె విజయనగరం మహారాజు, ఆయనకంటెహైదరాబాదునవాబు, ఆయనకంటె Rockfeller లేక Carnegie. ఎక్కడికి అంతు- నీకంటె తక్కువవాళ్ళు కోటానకోట్లు. వాళ్లందరి ముందూ నువ్వో పిల్లజమీందారువు. ఎక్కడిదాకానో ఎందుకు. మన మేష్టర్లందరి కంటే నీస్థితి మంచిదని ఒప్పుకోకతప్పదు. ఈ అశాంతి, అసంతృప్తి, ఈవేదన ఇవన్నీ అర్థంలేనిమాటలు, దీన్నే Byronic unhappiness అంటారు. సమస్త సౌ

ఖ్యములూ అనుభవిస్తూ ఏదో బాధ పడుతున్నానడం కవులకు చెల్లుతుందేమోకాని మనకుకాదు. ఇంతదూరం చెప్పవలసిన వాడినికాను కాని నీవుచేస్తున్న గందరగోళంచూచి, పాపం రాజ్యం పడుతున్న బాధచూచి ఊరుకోలేక పెద్దవాడిని గనుక సాహసించి ఈమాటలూ నాలుగూ అన్నాను. మరోలా అనుకోవనుకుంటాను. వస్తాను పనుంది. నువ్వుకూడా బయటకు వస్తావేమోనని ఇలా వచ్చాను.

వెంకట్రావు

నేననుకోవడానికేముంది, మీలాటివాళ్లకు కేవలం prosaic people కు ఇవేమీ అర్థంకావులేండి. వెదురుగానిలెండి. కంఠశోషచాలా పడ్డారు. కాస్త కాఫీ పీల్చి పోదురుగాని.

నారాయణబాబు

ఇప్పుడు కంఠశోషలా కనపడ్డా, నిదానంమీద నిజం నీకేతెలుస్తుంది. మళ్లీవస్తా. (అని నిష్క్రమించాడు)

వెంకట్రావు

ఈపెద్దవాళ్లతో ఇదే వచ్చింది. ఒట్టి matter-of-fact గాళ్లు. ఎక్కడా imagination కాని, Romance కాని, sentiment కాని, ఏకోశాన్నీ ఉండదనుకుంటాను.

(పద్యం)

కష్టభూయిష్ట దుఃఖాంత కథల తోడ
విసివిపోతిప పుటలు త్రిప్పినకొలంది;
కునుకు దీపమారదు; పొడికనులకెదురరాదు;
బరువైన యెదమనోరథముపోదు;
పేదమృగముల నెత్తురుపీల్చిపీల్చి

బలిసిపోయిన శ్వాపదమ్ములవిధాన
వెఱిగోలుపుగాని, ఘట్టముల్ వేగచనవు;
మనుజ పశువుల దౌర్జన్యమునకు లోగి
యినుపతలుపుల చెరబడ్డ యనపరాధి
కీరమట్టులు స్వేచ్ఛావిహారమునకు
తెక్కలార్చు [ప్రాణము సుఖస్పృహలకలల;
దేవతా విగ్రహము లేని తేరువోలె
నీరస పరుత్సవ నిరలంకారమైన
యీావ్యథా క్లిష్ట జీవితకావ్యమునకు
నంతిమాశ్వాస శాంతిసమాప్తియెపుడొ.

రెండో రంగం

రమణారావు

అమ్మా. వెంకటావుగారిల్లు ఇదేనా అమ్మా.

రాజ్యం

అవునండి.

రమణారావు

ఇంట్లో ఉన్నారమ్మా, ఇలాకూచోనా అమ్మా, నిలబడలేకుండా ఉన్నాను. మీరేనా అమ్మా అయనభార్య.

రాజ్యం

అవునండి- దయచెయ్యండి- చాలానీరసంగా ఉన్నారు. దూరాన్నించి వచ్చినట్టున్నారు పాపం- దాహంఇవ్వనాఅండి.

రమణారావు

నువ్వేనా తల్లీ రాజేశ్వరీ-ఎన్నాళ్ళకు చూచానమ్మా-నేబ్రతికి ఉండగా నిన్నుచూడడం పడదనుకున్నానుతల్లీ. నిన్నుకళ్ళతో చూడడానికే బ్రతికి ఉన్నానమ్మా.

రాజ్యం

అయ్యో! బాబయ్యగారే- ఎప్పుడొచ్చారు- ఎక్కడనుంచి, ముందుఉత్తరమేనా రాశారుకారేం- ఇంతనీరసంగా ఇలా ఉన్నారేమిటి, జబ్బుపడ్డారా? ఉండండి, ముందు కాఫీ తీసుకొస్తాను.

రమణారావు

నా అమ్మా- నాతల్లి- నామీద ఇంతప్రేమున్నదా, ఇక్కడికి రావడానికే భయపడ్డానమ్మా, చాలాసందేహించా

రాజ్యం

ఎందుకూ! సందేహమెందుకు బాబయ్యగారూ- మీ ఇల్లు కాదూ ఇది.

రమణారావు

అలాగే అనుకున్నానమ్మా- కానికాలం- పరిస్థితులన్నీ మారిపోయినాయి. అంతా తల్లక్రిందయింది. ఏమిచెప్పను సిగ్గేస్తోంది చెప్పడానికి. నా ఆస్తంతా చూస్తూండగా హారతి కర్పూరంలా హరించిపోయింది. ఎందుకుపోయిందో ఎలా పోయిందో ఇప్పటికీ నాకు వింతగానే ఉంటుంది.ఎలావచ్చిందో అలాపోయిందనుకుని మళ్ళీనిలదొక్కుకుని మర్యాదగాబ్రతుకుదామని మూడు సంవత్సరములనుంచి విశ్వప్రయత్నం చేశాను. నేనుచెయ్యనిప్రయత్నం, తిరగనిపూరు, చూడని

పెద్దమనిషి లేనంటేనమ్ము. ఎక్కడా నాస్తివాచకంతప్ప మారుమాట వినపడలేదు. అంతసంపాదించి, అంత ఉచ్ఛ స్థితికివచ్చి, అంత పేరు ప్రతిష్టలతోబ్రతికి అక్కడినుంచి పాతాళంలో పడితే ఇంక మళ్ళీలేవడం ఎక్కడ. జీవితంలో ఉచ్ఛ ఒక్కసారే కాని ఇన్నిసార్లు రాదనుకుంటాను. అదృష్టవంతులకు ఆ ఉచ్ఛ చివరనువచ్చి జీవితాంతంవరకూ లాక్కుపోతుంది. నాపోటినిర్భాగ్యుడికి ముందువచ్చి చివరను ఇలా నరకంలో పడదోస్తుంది. మీకెన్నో ఆశలుకల్పించి, ఎన్నోవాగ్దానాలుచేసి ఈస్థితిలో ఇక్కడకు ఎలారానని సిగ్గుపడి, అడుక్కుతినడం మంచిదని నిశ్చయించుకుని తిరిగాను. అలాగే స్వదేశంచేరుకున్నాను. ఇక్కడ ఆముష్టికూడాపుట్టడంలేదు. అంతా నాకంటే దరిద్రులులా ఉన్నారు. ఈవేళకునాల్గురోజులయింది అన్నం కళ్లచూచి. ఇంక ప్రాణంపోయేటట్టుంది. పోయినా ఇబ్బందిలేదు. నాకోనం ఏడ్చేవాళ్లూ ఎవ్వళ్లూలేరు. కాని అలా వీధులో చావలేకపోయాను.ఎక్కడికివెళ్ళను, ఆఖరుకు భయపడుతూ ఇక్కడకొచ్చాను.

రాజ్యం

(దుఃఖం ఆపుకొని) బాబయ్యగారూ- ఎంతపనిచేశారు ఇక్కడ నేనుండగా మరో ఆలోచన మీకెందుకు కలగాలి.

రమణారావు

అప్పుడన్ని ఆశలుకల్పించి ఇప్పుడు రిక్త హస్తాలతో వచ్చి మీనెత్తిని...

రాజ్యం

న్యాయమా అలాఅనడం. నేను మీపిల్లనుకాదూ, డబ్బుంటే నాపినతండ్రిఅయి లేకపోతేకాకపోతారా. మీఅల్లుడూ మరోలాం

టిమనిషికారు. మీకేంసందేహం అక్కర్లేదు. మీరిక్కడనుంచి కదలడానికివల్లకాదు. ముందు స్నానంచెయ్యండి. భోజనం చేతురుగాని, (అని అయిన్ని తీసుకువెళ్లి....మళ్లి వచ్చిభర్తతో) ఇదుగో, ఏమండోయి ఇలాచూడండి, మీకోశుభవార్త.

వెంకట్రావు

ఏమిటది, మీబాబయ్య డబ్బు పంపాడా (అంటూ వెంకట్రావు వస్తాడు.)

రాజ్యం

అంతకంటె తమాషా, మాబాబయ్యగారే వచ్చారు.

వెంకట్రావు

ఆం. నిజంగానే ఏం నన్ను పిలిచావుకావేమి. ముందు ఉత్తరమేనా రాశారుకారేం ! స్టేషనుకు వెళ్లేవాళ్లం.

రాజ్యం

లోపల స్నానం చేస్తున్నారు.

వెంకట్రావు

కానిని వేడినీళ్లేనా పెట్టకపోయినావు. Boilerలో క్షణంలో కాగుతాయికద. త్వరగా వంట చెయ్యాలో, ఫలహారమో కనుక్కొని కానియ్యి.

రాజ్యం

పాపం భోజనమే చేస్తారు. నాలుగురోజులయింది భోంచేసి.

వెంకట్రావు

ఏం వంట్లో బాగాలేదా.

రాజ్యం

లేదు. శారీరకంగానూ మానసికంగానూ కూడా బాగాలేదు పాపం.

వెంకట్రావు

కొన్నాళ్లిక్కడుండమందాం. హాయిగా ఉంటారు. దేశాటనం చేసి వచ్చినమీదట ఇల్లంటె ఏమిటో సౌఖ్యమంటె ఏమిటో తెలుస్తుంది. పాపం శుభ్రమైన పప్పూ ఆవకాయికూడా మొహం వాసి ఉంటారు.

రాజ్యం

అవునుపాపం.

వెంకట్రావు

అయితే ఆయన ఆస్తంతా తీసుకువచ్చేసి జీవితశేషం ఇక్కడనే గడపకూడదూ. ఇంకా ఎన్నాళ్లీ విదేశవాసం, సంపాదించినకొద్దీ, ఇంకా సంపాదించాలనే ఉంటుంది, ఈఉన్నది చాలదు కనుకనా.

రాజ్యం

ఇక్కడుందా మనేవచ్చేశారు. చాలా సిగ్గుపడుతూ భయపడుతూ వచ్చారు.

వెంకట్రావు

ఏమీ.

రాజ్యం

ఏమీలేదు. ఆస్తిఅంతా ఒక్కకానికూడా లేకుండాపోయిందట.

వెంకట్రావు

ఆఁ.

రాజ్యం

మూడేళ్లనుంచి అష్టకష్టాలూ అనుభవించి, యాచనచేసి కుని బ్రతుకుతూ అదీ దొరకక్క, ఎక్కడికివెళ్ల డానికి తోచక ఈ రిక్తహస్తాలతో ఇక్కడికి వస్తే మీరేమైనా అనుకుంటారేమో నని భయపడుతూ గత్యంతరంలేక నాలుగు ఉపవాసాలతో వచ్చారు.

వెంకట్రావు

ఆఁ పాపం, ఎంతమాట. ఏమనుకుంటాము. ఎంతపని చేశారు.

రాజ్యం

భయంకాదా పాపం. మనకేదో కనకాభిషేకం చేస్తానని ఆశ కల్పించి, ఇప్పుడుఏమీలేదని చెప్పడానికి మొహంచెల్లక అబ్బ ఎన్ని బాధలుపడ్డారో. ఆయిన్నిచూస్తే కడుపు చెరువైపోతుంది.

వెంకట్రావు

ఆస్తిపోతె మనం ఏం చేస్తాం. మనమేమైనా దాచి పెట్టామా. ఉంటే మనఅదృష్టం లేకపోతే మనదురదృష్టం అనుకుంటాం, అందుకని పాపం ఇంతకాలం ఇంతబాధపడాలా, ఇంత నందే హించాలా. నీకుతండ్రిఅయినా పినతండ్రిఅయినా ఉన్నది అయిన ఒక్కరాయెను, కష్టంలో కూతురుకాక ఎవరవుతారు. నేను మట్టుకు వద్దంటానా! అంత అవివేకినా.

రాజ్యం

అయినకేకాదు. నాకూభయంగానేఉంది, మీరేమంటారోఅని

ఇన్నాళ్లనుంచి మీరుచేస్తున్న హంగామాకి ఇప్పుడిలా ఉంటుం దని ఎలాఅనుకోను.

వెంకట్రావు

రాజూ. ఇంతేనా నన్ను అర్థంచేసుకున్నది. ఇన్నాళ్లనుంచి కాపురంచేస్తూ నాస్వభావం సరీగా తెలుసుకోలేకపోయావుకదా.

రాజ్యం

తెలుసుకొన్నాలెండి. అమాత్రం తెలుసుకున్నాను గనుకనే ఇన్నాళ్లూ మీతో కాపురంచేయగలిగాను. లేకపోతే అప్పుడే విడా కులిచ్చి ఉందురు.

వెంకట్రావు

సంతోషించాను. కాని ముందు పాపం అయనకు భోజన ప్రయత్నంచెయ్యి. నిస్త్రాణవస్తుందేమో కూడాను.

రాజ్యం

అ. (రాజ్యం నిష్క్రమిస్తుంది)

వెంకట్రావు

పద్యం.

మ. అది మేలైనపురంబు పూజ్యచరితుం-
డా రాజు రాణ్మండలం
బది పార్శ్వంబున నావిదగ్ధసభ వా-
గ్జాస్య లత్యుద్ధతం
బది రాజన్యక మద్ది వందినికరం-
బాగాథలున్ సర్వమున్

గదలం జేసినకాలమూ ర్తికినము
స్కారంబు సత్కీర్తికిన్.

శా. నీతిప్రౌఢవిహారులై నిపుణుల్-
నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ-
గాఢంబుగా సాగనీ
ఘాతం బప్పుడ పొందనీ నియతిమైఁ-
గానీ యుగాంతమునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరు గదా-
నిత్యంబు ధీరోత్తముల్.

తే. ఎవ్వరికి నిజ్జగంబున-నెంత ఫలము
దైవకృత మగునది వొందుఁ-దప్ప కతనిఁ
గారణము గాదు పెనుఁబ్రాపు-ఘనునిఁ జేరు
చాతకము వాతఁ బడు నల్ప-జలకణములు.

చ. నలువ కులాలు భంగి నలి నప్రభ
వాండము నందు దేనిచే
నిలిచె దశావతారవన-నిష్ఠితుఁ
డయ్యెఁ మురారి దేనిచేఁ
బెలుచఁ గపాలహస్తుడయి-భిక్షుకుఁ
డయ్యెఁ బురారి దేనిచే

నల రవి దేనిచే దిరుగు-నాఘునకర్మము
వంద్యమే కదా.

పూర్తిఅయేసరికి నారాయణబాబు వస్తాడు.

నారాయణబాబు

ఏమోయి వెంకట్రావు, ఇప్పుడేనా ఊడివస్తావా రావా, లేక ఇంకా అలా విచారసాగరంలో మునిగి తేలుతూ ఉంటావా. రా. పోదాం. రేడియోలో మంచి ప్రోగ్రామ్ ఉంది. మన కృష్ణ శాస్త్రి నాటకం.

వెంకట్రావు

ఇప్పుడు రాను. మా పినమామగారు వచ్చారు.

నారాయణబాబు

ఏమిటీ, ఎవరు. వారే! బంగారుగుడ్లుపెట్టే బాతే.

వెంకట్రావు

వారేకాని ఇప్పుడు బంగారుగుడ్లేకాదు అసలు గుడ్లు పెట్టడమే మానేసింది.

నారాయణబాబు

అంటే.

వెంకట్రావు

వారి ఆస్తిఅంతా పోయిందట. మూడు సంవత్సరాలనుంచీ పడరాని ఇక్కట్లు పడిపడి బాధలు సహించలేక హడలిపోతూ మేము గుమ్మంలోకి రానిస్తామో రానివ్వమో నని ఇక్కడకు వచ్చారు. అందుకనే పాపం ఈ మధ్యను ఆయన దగ్గరనుంచి ఉత్తరమేనా లేదు.

నారాయణబాబు

ఆహా! దైవసంకల్పం. అయితే ఇంక ఆయన-

వెంకట్రావు

ఇక్కడే ఉంటారు. పాపం ఆయనకు ఈ పెంపుడుకూతురు తప్ప ఎవరూ లేరు. ఎక్కడికి వెడతారు.

నారాయణబాబు

అయితే నీకు వచ్చే వారసత్వం పినమామగారు మాత్రమే నన్నమాట.

వెంకట్రావు

అవునండి, పోనీ పెద్దవాడు బోలెడంత అనుభవశాలి ఇంట్లో ఉంటాడు. నాకు కొంతబాధ్యత తగ్గుతుంది. ఇది ఒకటి నాకు మంచిదే.

నారాయణబాబు

బాగుంది బాబు-That's the spirit.

వెంకట్రావు

లేనివాళ్ళను చూస్తేనేకాని మనకు ఉన్నదాని విలువ తెలియదు.

నారాయణబాబు

నిజమే-Good bye!

వెంకట్రావు

పద్యం :

ఉ. బాలకుడై క్షణంబు యువ-
భావయుతుం డయి కొంత కాల ము

ద్వేలదరిద్రుఁడై క్షణము-
విత్తసమన్వితుఁడై క్షణంబు జీ
ర్ణాలసగాత్రుఁడై నటుని-
యట్ల నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయనామమైన తెర-
యందుఁ జొరంబడు సత్వరంబుగన్.

చ. తనువు ముడుంగుఁ బాదగతి-
దప్పును దంతము లూడఁ జీఁకటుల్
కనుఁగవ వర్తిలుం జెవుడు-
గ్రమ్మును జొంగలు గారు మోమునన్
జనములు మాట చేకొనరు-
సన్నిధిఁ జేరదు భార్య పుత్త్రుఁడుం
గొనకొని శత్రునట్ల తిరు-
గుం గడుఁగష్టము వృద్ధదేహికిన్.

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరి-
యించుట దైన్యము లేనితిఁడియున్
నిచ్చలు సాధుసంగమును-
నిర్మలశాంతము శాస్త్రబోధమున్

మచ్చిక లోనఁ బూని వెలి-
మట్టని చిత్తము నాఁగ నింతయున్
వచ్చుట యేమి హాళాన్నతత-
పంబుఫలంబో యెఱుంగ నేర్తుమే.

ఉ. శ్రీనుత కాశియం దమర-
సింధువు చెంగట నిల్చి గోఁచినిం
బూని ప్రణామముద్రఁ దల-
మోపి "పురాంతక! పార్వతీశ! శం
భో! నిటలాక్ష! రక్ష" యని-
మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలానుసం
ధానత నెన్నఁ డేఁ గడపెదన్-
దినముల్ నిమిషంబులై వడిన్.

# పాతివ్రత్యం

## పాత్రలు

రమణారావు— సరసుడు. చదువుకొన్నవాడు. ఆధునికుడు. ఉద్యోగి. వయస్సు 45 సంవత్సరములు.

సావిత్రమ్మ— రమణారావుభార్య. పూర్వాచారపరాయణురాలు. చాలాఉత్తమురాలు. ఆదర్శగృహిణి అని పేరుపొందిన ఇల్లాలు. వయస్సు 38 సంవత్సరములు.

ప్రకాశరావు— రమణారావు స్నేహితుడు. స్కూలుమాష్టరు.

సరోజినిదేవి<br>శాంతమ్మ<br>సుభద్రమ్మ } స్త్రీసమాజ సభ్యురాండ్రు.

సమయం – మధ్యాహ్నం.

సుమారు రెండుగంటలవేళ. రమణారావుగారి ఇంటి ముందు.

ప్రవేశం – రమణారావు - భార్య, సావిత్రమ్మ. రమణారావు అప్పుడే ఊరినుంచివచ్చి, బట్టలు విడుస్తూవుండగా సావిత్రమ్మ కాళ్ళుకడుక్కోడానికి నీళ్ళు తీసుకునివస్తుంది.

సావిత్రమ్మ

వచ్చారా!

రమణారావు

ఊఁ!

సావిత్రమ్మ

ఎంతసేపయిందండి వచ్చి!

రమణారావు

ఇప్పుడే.

సావిత్రమ్మ

చడీచప్పుడూ కాకుండా వచ్చారు.

రమణారావు

మేళతాళాలతో రమ్మంటావా!

సావిత్రమ్మ

అదికాదండీ.

రమణారావు

లేకపోతే వచ్చెనిదిగో శంఖుడు వచ్చెనిదిగో-అని భాగవతంలోలాగ పాడుకుంటూ రమ్మన్నావా!

సావిత్రమ్మ

బాగానేవుంది. తలుపుచప్పుడన్నా కాలేదు. పిలవనన్నా పిలిచారుకారన్నాను.

రమణారావు

తలుపు బిద్దలుకొట్టి నిన్నుకేకలేశి హడావిడి చేస్తేనేకాని, ఊరినుంచివచ్చినట్టు కాదాఏమిటీ?

సావిత్రమ్మ

బాగానేవుంది. ఏమాటన్నా తప్పే!

రమణారావు

తప్పేముంది.

సావిత్రమ్మ

మాటవరసకు ఏదోఅంటే—

రమణారావు

నేనూ మాటవరసకే అంట—

సావిత్రమ్మ

గుమ్మంలోకి రావడమే అలా చిటచిటలాడుతూ వస్తారేం. నన్నుచూస్తే మరీవస్తుంది - నా ముఖారవిందం కాబోలు.

రమణారావు

ఎంతమాట. 'నీవు మహాపతివ్రతవు నీసౌశీల్య మిల్లాంధ్ర కెల్లనుమేల్బంతి' అని దేశమంతా ఖ్యాతిగాంచిన దానవు. రేపో-మాపో అఖిల భారత స్త్రీ సమాజం తరఫున సన్మానం అందుకో బోతున్నావు—నీ ముఖారవిందానికేమి. నాస్వభావం—నువ్వు ఎరగని దేమున్నది—.

సావిత్రమ్మ

ఇది బాగుందండోయి మీమాటలూ, మీరూను. నాబొంద నాకు సన్మానమేమిటి. నేనేమన్నా చదువుకున్నదాన్నా! ఉద్యోగం చేశానా! ఊళ్ళు ఏలానా! మీపాదసేవ చేసుకుంటూ మీచాటున ఇలాబతికి, ఈ పసుపు కుంకుమతోటి వెళ్ళిపోతే చాలు! నాకు సన్మానాలూవద్దు చట్టుబండలూ వద్దు.

రమణారావు

బాగుంది. నీవు వద్దంటే తప్పుతుందా ఏమిటి. వాళ్ళు చెయ్యా తలుచుకున్నది ఎలాగూ చెయ్యక మానరు!

సావిత్రమ్మ

ఇదేం ఖర్మమండీ! నన్నిలా బతకనివ్వరా ఏమిటి—

రమణారావు

బ్రతక నివ్వక పోవడానికేముంది. వాళ్ళు సన్మానంచేసి గౌరవిస్తామన్నారు కాని గాడిదను చేస్తామనలేదుకదా! అలా ఖంగారు పడతావెందుకూ.

సావిత్రమ్మ

హఠాత్తుగా వాళ్ళకీ దుర్బుద్ధి ఎందుకు పుట్టిందండీ.

రమణారావు

దుర్బుద్ధి ఏమి, సద్బుద్ధే—నువ్వు మహా పతివ్రతవనీ, పాతివ్రత్యం స్త్రీలకు ఉత్తమలక్షణమనీ, ఆగుణం నీలో అతిశయంగా ఉన్నదనీ, అందుకని సన్మానార్హురాలవనీ నిశ్చయించారు.

సావిత్రమ్మ

నే నే కాని తక్కిన ఆడవాళ్ళుమట్టుకు, ఈ కాపరాలు చేస్తున్నవారంతా పతివ్రతలుకారా ఏమిటండీ?

రమణారావు

కావచ్చు-కాకపోవచ్చు. అయినా వాళ్ళ పాతివ్రత్యానికీ నీ పాతివ్రత్యానికీ చాలా తేడా ఉంది.

సావిత్రమ్మ

చాల్లెద్దురూ! మీ కబుర్లూ మీరూను. పాతివ్రత్యంలో ఇన్ని తేడాలుంటాయా ఏమిటి.

రమణారావు

ఉండకేం ఉంటాయి-వాళ్ళది ఇహానికి సంబంధించినది-నీది పరానికి సంబంధించినదీని.

సావిత్రమ్మ

ఏమో మీరు చదువుకున్నవారు, తెలివైనవారూను. నేను అజ్ఞానపు ఆడ పీనుగను. మీతో వాదించగలనా, అఘోరించ గలనా.

రమణారావు

వాదించలేక పోవడమేమి ఖర్మం.

సావిత్రమ్మ

లేకపోతే ఇహానికి సంబంధించడమేమిటి. పరానికి సంబంధించడమేమిటండీ!

రమణారావు

అంటే ఏమిటా! మామూలువాళ్ళు వాళ్ళభర్తలను అన్ని విధాలా సంతోషపెట్టడం, తమరు సుఖపడడమూను. ఇలా ఇహసౌఖ్యం అనుభవించ గలుగుతే పరం సంగతి పరమేశ్వరుడు చూస్తాడు.

సావిత్రమ్మ

నేను మట్టుకు ఏం చేస్తున్నాను. మీసౌఖ్యం సంతోషమే నా సౌఖ్యం సంతోషం అనుకుని శాయశక్తులాతంటాలు పడుతున్నాను! మీకు ఎక్కడ ఏం లోపం జరుగుతుందోనని వెయ్యి కళ్ళతో కనిపెడుతున్నానా. మీకు అమధ్యని జబ్బుచేస్తే, ఎప్పుడు నిమ్మళించి బయటపడతారా అని వెయ్యి దేవుళ్ళకు మ్రొక్కుకున్నా.

రమణారావు

అదే నీలో విశేషం. నాకు మళ్లి జబ్బుచేస్తే బాగుండుననికూడా అనుకుని ఉంటావు-ఈమాటు పదివేలదేవుళ్ళకు మొక్కుకోవచ్చును. అంటే స్వర్గానికి పదివేల సోపానాలు నిర్మించుకుంటున్నావన్నమాట. విశేషించి నీ పాతివ్రత్యం వల్ల నా తెగులు కుదిరిందనే ఖ్యాతికూడా నీకు వస్తుంది.

సావిత్రమ్మ

అయ్యో! ఎంత మాటన్నారండీ – మీకు జబ్బుచేస్తే నాకు సరదాటండీ. మీమీదనాకు అపేక్షలేదంటారుటండీ! మీ సుఖమే నా సుఖమని అనడంలేదుటండీ నేను...ఆఖరుకు ఇదిటండీ మీరు అనుమానించింది. నేను పతివ్రతను కాదంటారండీ!

రమణారావు

నువ్వు పతివ్రతవు కావని ఎలా అంటాను. నీ పాతివ్రత్యంతో అసుఖంబుం బాధపడుతుంటేను.

సావిత్రమ్మ

అందే నేనలా ఉండటం మీకిష్టం లేదా ఏమిటండి. మీమాటలన్నీ వింతగా ఉన్నాయి.

రమణారావు

అంత పతివ్రతవుకాకుండా వుంటే కాస్త బాగుండునేమో నని అప్పుడప్పుడనుకుంటూ ఉండేమాట వాస్తవమే!

సావిత్రమ్మ

అంటే!

రమణారావు

అప్పుడింకాస్త దయాదాక్షిణ్యం హృదయం మానవత్వం నీలో ఉండునేమోనని ఆశ.

సావిత్రమ్మ

నాకిప్పుడవేవీ లేని రాక్షసి నంటారు.

రమణారావు

అబ్బెబ్బే! ఎంతమాట. అవన్నీ ఉన్న దేవతవు. ఎటొచ్చీ నాకు వాటితోటినిమిత్తం లేదంటాను. ఇవన్నీ ఇహానికి సంబంధించినవి.

సావిత్రమ్మ

ఉహూఁ-నాకు...

రమణారావు

నీకు దృష్టి అంతా పరంమీదనే-నీజీవితమంతా అందుకు సాధన.

సావిత్రమ్మ

అది తప్పంటారా. మాకు పెద్దలు చిన్నప్పటినుంచీ అదే మా విధి అని నేర్పారు-ఏంచెయ్యమంటారు.

రమణారావు

అవును! అదే వచ్చినచిక్కు. అందుకని ఈ భర్త-ఈసంసారం అంతా నీకు సాధనగా ఉపయోగించే సామగ్రి.

సావిత్రమ్మ

అంతే కాని మీ మీదనేమీ నాకు అపేక్ష కాని భక్తి కాని లేదంటారు.

రమణారావు

లేకేమి ఉన్నాయి - నీసాధనకు నేనో నిమిత్తమాత్రుణ్ణి. దొడ్లో తులసిమొక్కమీద నీకు ఎంత భక్తిగౌరవాలో, ఇంట్లో ఉన్నభర్తమీదా అంతే భక్తిగౌరవాలు. దొడ్లో తులసిమొక్కకి రోజూ ఓదణ్ణంపెట్టి కాసినినీళ్ళు పోసి గుడోపహారనైవేద్యం చేస్తావు. ఇంట్లోభర్తని స్నానంచేయించి సూపశాకోపహారం పెడతావు. ఆత్మప్రదక్షిణనమస్కారం చేసుకుంటావు.

సావిత్రమ్మ

అయితే అదంతా తప్పంటారా ఏమిటి - నేనేంచెయ్యను. మావాళ్ళు పూర్వకాలపువాళ్ళు-వాళ్ళధోరణే నాకూ అబ్బింది. ఈకాలపు పద్ధతులూ వేషాలూ మాకుతెలియవు.

రమణారావు

తప్పని నేను అన్నానా.

సావిత్రమ్మ

లేకపోతే ఏమిటి మీరనేది - అన్నమానం వేళాపాళా లేకుండా - అబ్బా పోనిద్దురూ - నోటితోటి అనడానికికూడా సిగ్గేస్తోంది.

రమణారావు

అవ్వే! అలాగని అనలేదునేను. మొగుడు మొగాడనీ, మనిషి అనీ, అతనికీ ఆకలిదప్పికలతోపాటు కొన్నికోరికలు-ఐహికమే - శారీరకమే అనుకో - ఉంటాయనీ గ్రహించి, తదనుగుణ్యంగా భార్యకూడా వుంటే దాంపత్యసుఖం ఎక్కువగా వుంటుందని నామనవి—ఏంచెప్పను—నేను చదువుకున్న చదువు యింతటిది.

సావిత్రమ్మ

నేనుపుట్టుక - మిమ్మల్ని - ఎప్పుడేనా వద్దన్నానా ఏమిటండీ-

రమణారావు

అవ్వే- వద్దంటావా-పతివ్రతవు. వద్దనీ అనలేదు -అంతకంటే కావాలని అనలేదు

సావిత్రమ్మ

దాంపత్యం అంటే అంతేనన్నమాట—ఇంకేమీ అక్కరలేదన్నమాట.

రమణారావు

అంతవరకూ ఉంటే తక్కినవన్నీ వాటితోటే వస్తాయి. కామంవల్ల కూడా మోక్షం సాధించవచ్చునన్నారు. మోక్షం మాట ఎలాఉన్నా మామూలు మనిషి బ్రహ్మానందతుల్యమైన ఆనందం అనుభవిస్తాడు. దానివల్ల సాంబశివత్వం-అర్ధనారీశ్వరత్వం అతనికి కలుగుతుంది – భార్య శివశక్తి అవుతుంది.

సావిత్రమ్మ

అయితే మీరింటికిరాగానే వచ్చి మీవళ్లో కూచుంటే—

రమణారావు

అప్పుడు మహాకామేశ్వరాంకస్థిత మహా కామేశ్వరివి అవుతావు !

సావిత్రమ్మ

చాల్లెండి మీకబుర్లూ మీరూను. మొగుడికి అంటుల్లా అయిపోయి. అస్తమానం చెట్టాపట్టా లేసుకుని వీధులంట తిరుగుతే అదేదో ప్రేమా అవీ ఉన్నట్టు, లేకపోతే లేనట్టు కాబోలు.

రమణారావు

వీధుల్లో తిరగమన్నానా నేను. భార్యా భర్తలు మానవుల్లా ఉండాలన్నాను.

సావిత్రమ్మ

బాగా అన్నారు. లేవండి. కాళ్ళు కడుక్కోండి.

రమణారావు

కాళ్ళు కడుక్కొంటే చాలా – స్నానంకూడా చెయ్యమంటావా.

సావిత్రమ్మ

నేను చెప్పాలిటండీ –స్నానంచేసి భోజనానికి లేవరూ–. మెయిలుకో వస్తానన్నారు కదా అని మెయిలువేళదాకా చూశాను. మెయిలు వెళ్ళి చాలా సేపయింది. ఎందుకు రాలేదా –ఏమా అని ఆలోచిస్తూ ఇంకలేచి భోజనం చేదామా అనుకుంటున్నాను.

రమణారావు

అయితే నువ్వింకా భోజనంచెయ్యలేదూ—

సావిత్రమ్మ

లేదు.

రమణారావు

ఏం—

సావిత్రమ్మ

మీరువస్తారేమోనని ---

రమణారావు

అవును - మరచిపోయాను - పతివ్రతవుకదూ — వెళ్ళు భోంచెయ్యి.

సావిత్రమ్మ

అదేమిటి— మీరులేవరా ఏమిటి—

రమణారావు

లేవను—

సావిత్రమ్మ

ఏమి వంట్లోబాగాలేదా ఏమిటండి - ఏమన్నానరిగా చెప్తారా ఏమన్నానా!

రమణారావు

చెప్పడానికేముంది— నిక్షేపమల్లే ఉంది.

సావిత్రమ్మ

మరి, భోజనానికి రానంటారేం.

రమణారావు

నేను భోజనం చేశాను.

సావిత్రమ్మ

అదేమిటండి— ఎక్కడ భోంచేశారు?

రమణారావు

స్నేహితులతో వచ్చాను. వాళ్ళింటికి రమ్మని బలవంతం చేస్తేను అక్కడికెళ్ళి భోంచేసి వచ్చాను.

సావిత్రమ్మ

అదేం ఖర్మమండి— వూళ్ళోకొచ్చికూడా ఇంటికిరాకుండా ఎక్కడో భోజనం చెయ్యడ మేమిటండీ—

రమణారావు

ఖర్మంలేదు. ప్రారబ్ధంలేదు. స్నేహితులింటికి ఎప్పుడూ వెళ్ళకూడదాయేమిటి-రేపుమనింటికీ ఎవళ్ళూరానక్కర్లేదూ-

సావిత్రమ్మ

వెళ్ళకూడదనికాదండి-కార్యకరాదులేమీ ఉన్నట్టులేదయ్యో —అంత రైలుదగ్గరనుంచే, ఇంటికేనా రాకుండా వెళ్ళడ మెందుకూ అని— ఇంతకూ ఎవరాస్నేహితులు—

రమణారావు

ఒకడాక్టరులే—

సావిత్రమ్మ

ఎవరు సూర్యనారాయణగారా?

రమణారావు

కాదు—

సావిత్రమ్మ

చలపతిరావుగారా—

రమణారావు

ఊc హుc.

సావిత్రమ్మ

సుబ్బారావుగారా

రమణారావు

ఓ హెహె! కాదు - కొత్తగావచ్చారు- ఈవేళే.

సావిత్రమ్మ

అయితే అప్పుడే వారింటికి భోజనానికెలా వెళ్ళారండి— వచ్చిందో అడుగూ రనినో అడుగూను పాపం—పోనీ వారినే ఇక్కడకు రమ్మనక పోయినారా—

రమణారావు

వారికి ఇల్లూ అదీ నేనే కుదిర్చి పెట్టాను- ఇవాళ మంచి రోజని తిన్నగా వారింటికివెళ్ళారు.

సావిత్రమ్మ

మరి మెయిల్లో వచ్చి అప్పుడు వంటచేసుకుని భోంచేసారా.

రమణారావు

లేదు, హోటలునుంచి తెప్పించాను, మాకిద్దరికీని.

సావిత్రమ్మ

ఏమిటీ హోటలునుంచా — అదేం ఖర్మమండీ గుప్పెడు మెతుకులు నేను పెట్టలేనూ- వారింటికి తీసుకువెళ్ళి ఆయిన సామానూ అదీ అక్కడ దింపించి మనింటికి తీసుకురాక పోయారా —పైగా మీరుకూడా ఆ హోటలు మెతుకులు తినడం- ఏమనుకుంటారు ఆయన-

రమణారావు

ఆయనకాదు- ఆవిడ—

సావిత్రమ్మ

ఏమిటీ-

రమణారావు

ఏమిటీ ఈ వెధవగోడవ. నువ్వెళ్ళి భోంచెయ్యక.

సావిత్రమ్మ

అయితే పాపం ఆవిడకు ఇల్లుకుదిర్చి, గృహప్రవేశం చేయించి వింటారగించి వచ్చారన్నమాట. అందుకనే అలా ఉన్నారు.

రమణారావు

ఎలా ఉన్నారు-

సావిత్రమ్మ

ఎలా ఉన్నారో మీకు తెలియదా ఏమిటి పాపం. హాయిగా, అక్కడ భోజనంచేసి ఇంటికి వచ్చేసరికి, నాపాడు మొహం కనపడ్డది. నన్ను నాలుగూఅన బుద్దిఅయింది.

రమణారావు

నాలుగూ అనలేను, అయిదూ అనలేదు వెళ్ళి భోజనం చెయ్యి.

సావిత్రమ్మ

భోజనానికేం తొందర-కడుపు నిండిపోయింది.

రమణారావు

నిండినాసరే-వెళ్ళి భోంచెయ్యి.

సావిత్రమ్మ

ఎవరండీ ఆవిడ—

రమణారావు

లేడీడాక్టరు —నువ్వేరగవు.

సావిత్రమ్మ

ఆ బెజవాడావిడేనా—

రమణారావు

ఏ బెజవాడావిడ —

సావిత్రమ్మ

అదే ఇదివరకు బెజవాడలో డాక్టరు పని చేస్తున్నావిడేనా అంట.

రమణారావు

అవును, అయితేనేం,

సావిత్రమ్మ

అబ్బే ! ఏంలేదు, ఆవిడ అవునా కాదా అని—

రమణారావు

నువ్వేమి ఎరుగుదువు ఆవిడను.

సావిత్రమ్మ

విన్నా లెండి—

రమణారావు

ఏం విన్నావు--

సావిత్రమ్మ

వినదగ్గది ఉన్నప్పుడు ఏదేనా వింటాను.

రమణారావు

ఏమిటా వినతగ్గది.

సావిత్రిమ్మ

ఏమో మీకే తెలియాలి.

రమణారావు

ఈ అడ్డు ప్రశ్నలూ, వెర్రిమొర్రి సమాధానాలు మానేసి అసలు సంగతి చెపుతావా.

సావిత్రిమ్మ

ఏం చెప్పమంటారు.

రమణారావు

అదే వద్దంటోంట—నువ్వు ఏమివిన్నావు, ఎవరివల్లవిన్నావు.

సావిత్రిమ్మ

నేను తప్పుమాట ఏమన్నాను, అయినా మీకంత ఉలుకెందుకు!

రమణారావు

ఉలుకూలేదు గిలుకూలేదు. అడిగినదానికి సమాధానం సరిగాచెప్పు.

సావిత్రిమ్మ

మీరు వారం వారం, శలవు లొచ్చినప్పుడల్లానూ, బెజవాడ వెడుతున్నది తెలుసుకున్నాను.

రమణారావు

ఊఁ. .

సావిత్రిమ్మ

బెజవాడ వెళ్ళి ఈవిడను కలుసుకుంటున్నారనీ ఆ రెండు మూడు రోజులూ అక్కడ కాలక్షేపం చేసి వస్తారనీ తెలుసుకున్నాను. మీరు చెప్పకపోతే నాకుతెలియదనుకున్నారా-

రమణారావు

హూని రాక్షసీ-ఎలా తెలుసుకున్నా విదంతానంటే దానికి సమాధానం చెప్పవేం.

సావిత్రిమ్మ

మీరోసారి రాజమండ్రి వెడుతున్నానని చెప్పి వెళ్లిన తరువాత మీ బట్టలు చాకలికివేస్తూంటే చొక్కాజేబులో మిమ్మల్ని రమ్మని ఆహ్వానిస్తూ అడదస్తూరితో ఒక ఉత్తరం కనపడ్డది. ఆతరువాత చాలా ఉత్తరాలు చూశాను. బెజవాడలో ఎరిగున్న వాళ్ళకు రాసి ఆవిడ సంగతి వాకబు చేశాను. అంతా విని సంతోషించాను.

రమణారావు

ఓసి నీ పాతివ్రత్యం మండిపోను. ఇదా నువ్వు ముంగిలా కూచుని చేసేపని. నా ఉత్తరాలు చూసి నా మీద గూఢచారులని పెడతావా-ఓసి దౌర్భాగ్యురాలా-

సావిత్రిమ్మ

మీరు అబద్ధమాడడమెందుకు. మీరిలాంటిపనులు చెయ్యగాలేనిది-నేను తెలుసుకుంటే తప్పొచ్చిందేం.

రమణారావు

ఏం చేశాను-నేనెవ్వళ్ళతోటీ నీబోడి శెలవు లేనిదే మాట్లాడకూడదా ఏమిటి ?

సావిత్రమ్మ

మాటలు పాపం-అడ్డమైన ముండలని చేరదీసి మీ ఇష్ట మొచ్చినట్టు ఆడుతూ-మాటలుట-దేశమంతా కోడై కూస్తుం టేను.

రమణారావు

నోరుముయ్యి-మాటలు మిగిలావంటే దవడపళ్ళు విరుగు తాయి.

సావిత్రమ్మ

పోనీ విరగ్గొట్టండి. ఇంకేం చేస్తారు. దీని చదువుమండ. ఇందుకే కాబోలు ఆచదువంతాను. ఈచదువులూ, ఈ ఉద్యో గాలూ, ఇంకొకళ్ళ కొంపలు కూల్చడానికే కాని మర్యాదగా బతకడానికి పనికిరావు కాబోలు.

రమణారావు

నోరు మూస్తావా-గొంతు నొక్కనా.

సావిత్రమ్మ

నేను నోరు ఎందుకు ముయ్యాలి. ఇలాంటి నీతీ జాతీ లేని పీనుగలతో చెట్టా పట్టా లేసుకు తిరగడానికి మీకెలా ప్రాణం ఒప్పిందంట.

రమణారావు

నోరు మూస్తావా ముయ్యవా. ఆ చండాలపు నాలుక కోసే స్తాను.

సావిత్రమ్మ

కోసెయ్యండి. నానాలుక కోస్తారు కాని ప్రపంచంలో అం

దరి నాలుకలూ కొయ్యగలరా ఏమిటి? పాపం ఆ చండాలపు పీనుగమీద ఈగవాత్తే అంత బాధగా ఉందేం. ఇక్కడ నేనేమైనా సరే. దూరాన్ని ఏదో అనుకుంటే, అది చాలక పాపం దాన్ని ఇక్కడకు మార్పించి నా నెత్తినే ఎక్కిస్తున్నారా. కానివ్వండి. ఆ పీనుగ నాకంటపడాలి. అప్పుడు దానిబతుకు బయటపడాలి. ఈ ఊళ్లో ఈ వెధవ ఉద్యోగం ఎన్నాళ్లు వెలిగిస్తుందో చూస్తాను.

రమణారావు

నోరుముయ్యి-వెధవా-నోరుముయ్యి (అని గొంతు నొక్కుతాడు)

సావిత్రమ్మ

అలాగే నొక్కెయ్యండి. చంపెయ్యండి – నాపీడ విరగడై పోతే ఆముండని పెట్టుకుని, మీచిత్తం వచ్చినట్టు...

రమణారావు

చావు. వెధవా చావు.

సావిత్రమ్మ

అయ్యో-అయ్యో-ఊఁ చంపండి. త్వరగా చంపెయ్యండి. ('రమణారావు, రమణారావు' అని మొదట వినపడుతుంది. తరువాత తలుపు గభీమని తోసిన చప్పుడు) ప్రకాశరావు, సరోజినీదేవి, శాంతమ్మ, సుభద్రమ్మ, (ప్రవేశం- లోపలికి.)

ప్రకాశరావు

ఏమిటోయ్-రమణా-రమణా నీకేంమతిపోయిందా ఏమిటి!

ఆడవాళ్లు

అయ్యో అయ్యో, ఇదేంపాపం. విడిపించండి.

ప్రకాశరావు

రమణా-విడవ్వోయి.

రమణారావు

చావు-చచ్చావా-Rascal-చావు రాక్షసీ-నాప్రాణాలుతీసే శావు.

సావిత్రమ్మ

అయ్యో. పరమేశ్వరా, అపద్బాంధవా, తీసుకుపో తండ్రీ త్వరగా తీసుకుపో.

ప్రకాశరావు-ఆడవాళ్లు

అయ్యయ్యో-నిజంగా చచ్చిపోతుందోయి అవిడ.

రమణారావు

ఎప్పుడూ...చావు రాక్షసీ.

ప్రకాశరావు

ఓయ్ దరిద్రుడా-ఇదేంపనోయి....

ఆడవాళ్లు

మహాపతివ్రతను పట్టుకుని-

ప్రకాశరావు

ఒక్క క్షణంఉంటే అకొనఊపిరి కూడా పోను.

ఆడవాళ్లు

ఇంతదారుణం ఎక్కడేనా ఉంటుందా.

ప్రకాశరావు

బాగొచ్చావా యేం రమణా! అయితేమట్టుకు ఇంతఘోర్ణం తలపెట్టావేమిటి.

రమణారావు

విడిశావు నోరుమూద్దూ—ఘోరమూ— పాపమూ—

ఆడవాళ్ళు

పాపమా అని నిమ్మళంగా అంటారేమిటండీ—అటువంటి మహాపతివ్రతను పట్టుకుని నిండుప్రాణం తియ్యాలని తల పెట్టి...

రమణారావు

చస్తే పీడవదిలేది- నేను ఇది ఎంతో పుణ్యకార్యమని ఈ నాటికి సాహసించాను. మీరు అడ్డువచ్చి పాపంకట్టుకున్నారు.

ప్రకాశరావు

మహాపతివ్రతా శిరోమణి అని ప్రతిష్ఠ సంపాదించుకున్న పరమసాధ్విని పట్టుకుని చంపడం పుణ్యమంటావేమిటి—నీకేమన్నా మతిచెడలేదుకదా.

రమణారావు

మతి నాకుకాదు చెడత - మీకూ, దీనిపాతివ్రత్యం తలచుకుని పరవశంపొందే ఈ ఆడ వాళ్ళకూను. పతివ్రతట- Brother- నామాటనమ్ము - భార్య ఇలాటి పతివ్రతగా ఉండడంకంటె పరమ దౌర్భాగ్యం మరొకటి లేదనుకో—పగవాడి భార్యేనా పతివ్రతగా ఉండాలనినేను కలలోనైనా కోరను. పాతివ్రత్యం, దానిబొందాను. ఎంత పాతివ్రత్యం అయినా కొద్దిమోతాదులో భరించగలంకాని తెల్లవారి లేచింది మొదలు రాత్రిపడుకునేదాకా—కాఫీకి పాతివ్రత్యం, భోజనానికి పాతివ్రత్యం, టీకి పాతివ్రత్యం, మళ్ళీరాత్రి భోజనానికి పాతివ్రత్యం అయితే ఎలాగోయి బ్రతకడం, అయ్యో-దాని పాత

వ్రత్యం మండ, ఆసంగతి మరిచిపోయి మంచినీళ్ళు తాగ డానికేనా వీలులేకపోతే ఇంకనేమిటిపారి. నాకుమతిపోయిం దాఅన్నావే: నిజమే పోవడంలో ఆశ్చర్యమేమిలేదు—పోకపో వడం ఆశ్చర్యంకాని! ఈ పాడు పాతివ్రత్యంతో ఇన్నాళ్ళు మతిచెడకుండా ఎలాకాలక్షేపం చేశానా అని నాకే ఆశ్చర్యంగా వుంది, మరొకళ్లైతే ఏనాడో మతిచెడి ఏగంగలోనో దిగేవారు. పతివ్రత. దరిద్రపుముండ- ఒక్క క్షణంలో తప్పిపోయింది. మిమ్మల్నితగలెయ్య: ఏంపడిపోయిందని ఈక్షణంలో తగుల డ్డారు, ఇక్కడికి— ఎటువంటి సత్కార్యం చెడగొట్టారు— ఎన్నాళ్ళనుంచోఅనుకుంటున్నాను.నేటికెలాగోసాహసించాను. అదికాస్తా క్షణంలో తగలేశారు— ఛీ. నడవండవతలికి—

ఆడవాళ్ళు

అమ్మా, సావిత్రమ్మాగారూ—ఎలాఉందమ్మా.

సావిత్రమ్మ

(నెమ్మదిగా కళ్ళుతెరుస్తూ) తండ్రీ—తీసుకుపోతండ్రీ— త్వరగా— అయ్యో— అబ్బా—ఇంకా ఎంతసేపు— ఖర్మం ఆలస్యమయితే మళ్ళీ ఆయనమనస్సు మారిపోతుందేమో— అమ్మ అయ్యో అ...య్యో.

ఆడవాళ్ళు

అమ్మా భయంలేదులెండి. కాశిని మంచినీళ్ళు తాగండి.

ప్రకాశరావు

ఏమిటి, ఆవిడకు తెలివివచ్చిందా. అమ్మయ్యా ! రమణా కాస్త బ్రాంది ఎక్కడేనా సంపాదించు త్వరగా.

సావిత్రమ్మ

అమ్మ... అమ్మ

ఆడవాళ్ళు

ఫరవాలేదమ్మా—ఇంక భయంలేదులెండి—మేమంతా ఉన్నాం.

సావిత్రమ్మ

అఁ ఏమిటి....ఏరీ.

ఆడవాళ్ళు

భయంలేదు లెండి-ఇక్కడలేరు.

సావిత్రమ్మ

లేరూ వెళ్ళిపోయారా....అయ్యో భగవంతుడా నన్ను తీసు కెళ్ళవు. ఎంత పాపాత్మురాలిని. మళ్లీ ఎన్నాళ్ళకు అయనకు ఈ బుద్ధిపుట్టను.

ఆడవాళ్ళు

ఏమిటమ్మా.

సావిత్రమ్మ

ఎవరమ్మా మీరంతాను.

ఆడవాళ్ళు

మేము ఈఊళ్లో స్త్రీసమాజ సభ్యులం.

సావిత్రమ్మ

అలాగా అమ్మా-కూర్చోండి.

పరికాశరావు

ఏమమ్మా ఎలావున్నారు.

సావిత్రమ్మ

మీరూవచ్చారా-మీరంతా ఎందుకొచ్చారో పాపం.

సరోజిని

మిమ్మల్ని గురించి, మీసుగుణసంపత్తి, మీసౌశీల్యం మీ పాతివ్రత్యాన్ని గురించి చాలాకాలంగా వింటున్నాం. మీలాటి వారిని మెచ్చుకుని దేవతలు గౌరవించి వరాలిచ్చే రోజులు పోయినాయి. ఇప్పుడంతా ప్రజాస్వామికపు రోజులు. అందు చేత మీలాటివారు మాజాతిలో పుట్టినజాతిరత్నాలు. మాకు తోచినట్లు మాశక్తి వంచనలేకుండా మిమ్మల్ని సత్కరించా లని కుతూహలంతో...

సావిత్రమ్మ

అయ్యో మీసత్కారం చట్టుబండలుగానూ... మీమన్నన లుమంటిగడ్డలుకాసూ. నాకు సత్కారమేమిటర్రా. నాకష్టాలు గట్టెక్కే సమయంలో నాపాతివ్రత్యం ఫలించేక్షణంలో యము లాళ్లల్లావచ్చి ఆదికాస్తా చెడకొట్టారు.

ఆడవాళ్ళు

అదేమిటండీ నిష్కారణంగా మీప్రాణం తీస్తుంటే, మేము.

సావిత్రమ్మ

అదేనమ్మా నేను కోరుకున్నది. నాకంతకంటే కావలసిన దేముంది, అయనచేతుల్లో పోవడంకంటే. ఆఫలం నాకు దక్క కుండా చేశారు. చాలు దయచెయ్యండి.

ప్రకాశరావు

రండి పోదాం.

సరోజిని

ఇదేమిటి ఆశ్చర్యంగా ఉంది.

సుభద్రమ్మ

ఎంతశాంతం-ఎంతసహనం-

శాంతమ్మ

మరి పాతివ్రత్యమంటే ఏమిటి.

సావిత్రమ్మ

వెళ్లండమ్మా వెళ్లండి. పాతివ్రత్యంలేదు నాబొందాలేదు. అయిందంతాను. ఇంకచాలు. ఆయనకు ఎలా ఇష్టమైతే అలాగే ఉంటాను. వారికెప్పుడూ పక్కవాయిద్యం వాయించవలసినదాన్నే కదా! వారిహృదయాన్ని ప్రేమనూ ఆకర్షించలేని పాతివ్రత్యం, ఆయనకు అక్కరలేని పాతివ్రత్యం నాకు మాత్రమెందుకు! అరకంపాతివ్రత్యం ఆనాటివాళ్ళకు చెల్లింది. ఈజన్మకింక ఆ పాతివ్రత్యం మాట తలపెట్టను. నడవండి.

రమణారావు

ఏమిటీ అమాటమళ్లీ అను- Hurrah!

సావిత్రమ్మ

అలాగే! ఓమాటుకాదు - వందమాట్లంటాను. లేచి గంతు లెయ్యమంటే, గంతులేస్తానుకూడాను!

(అనిలేవబోతూ 'అమ్మా' అనుకుంటుంది. ఆడవాళ్లు సాయంచేస్తారు. తెరనెమ్మదిగా దిగుతుంది.)

# తుదిపలుకు

పుస్తకానికి పీఠిక కాని తొలిపలుకుకాని వ్రాయడం ఆచారం. దానివల్ల ప్రయోజనం ఏమిటి, ఎంతవరకు అనేది వేరే సంగతి. గ్రంథంలో చెప్పతలుచుకున్నది,చెప్పగా మిగిలినదీ, చెప్పతలుచుకోనిది, అన్నీ కలిపి ఉపోద్ఘాతంలో ఉపన్యాస ధోరణిని సాగించవచ్చు. లేదా కేవలం ఆత్మస్తుతి, స్వంతంగా జరుపుకోడం కాని పరులచేత జరిపించుకోడం కాని కావచ్చు; లేదా కేవలం అలంకారప్రాయం కావచ్చు. ఇదేదీ కాక ఒక హాస్యరచయిత అన్నట్లు, 'An introduction adds weight to a book' అనే ఉద్దేశమేనా కావచ్చు.

నా ఉద్దేశంమట్టుకు చదువరిని ముందు పుస్తకం చదవనివ్వాలని-అనగా చదవతలుచుకున్న వాళ్ళకు నుమండీ ఇతర అడ్డంకులూ అభిప్రాయాలూ లేకుండా. అప్పటికి వారికేదోఅభిప్రాయంగ్రంథంమీద ఏర్పడుతుంది బుద్ధిమంతులైతే, అప్పుడు పుస్తకం చదివిన మీదట, నిస్త్రాణరాకుండా ఇంకా చదవాలనే కుతూహలముండే అమాయకులు ఉపోద్ఘాతమో, పీఠికో, అదేదేనా ఉంటే చదివి, వారి అభిప్రాయాలూ తమ అభిప్రాయాలూ సరిచూచుకుని ఆనందించవచ్చును. అందుకని-నేను చెప్పతలుచుకున్నది-చివర చెప్పడానికి నిశ్చయించుకున్నాను; తీరా చూస్తే, చెప్పడానికేమీ కనపడడం

లేదు....అందులో ఏమన్నా ఉంటేకదూ చెప్పడానికి...కాని ఒకటి రెండు సంగతులు మాత్రం చెప్పకతప్పదు.

ఈ నాటికలో 'అభ్యుదయం' సంగతి ముందు మనవి చేస్తాను. 1929లోనో, 30 లోనో'50 One act plays'అనే పుస్తకం చదవడం సంభవించింది. అందులో Progress అనే నాటిక ఎందుచేతనో నామనస్సులో నాకుతెలియకుండా నిలిచిపోయి, లోపల తొలవడం అరంభించింది. ఆ రచయిత పేరుమరచి పోయానుఅందులోవిషయంతప్ప. ప్రపంచసంగ్రామం 1939 లో ప్రారంభమయింది. 40 లో ఈనాటిక అప్రయత్నంగా కాగితంమీద మూర్తీభవించింది. దీనికికారణమేమిటని ఆలోచిస్తే ఇటువంటిదేదో ఎక్కడో చదివి ఉంటానని లీలగా తోచింది. ఆతరువాత ననేకసార్లు ఆంగ్లంలో ఏకాంకికల సంపుటాలు చూచాను, కాని ఇదిమాత్రం ఎక్కడా దొరకలేదు.

1943 లో ఈ నాటికా, మరొకటీ కలిపి, ఈ పట్టణంలో Museum Theatre లో మొదట ప్రదర్శించాను. నాటకంకాగానే, నా మిత్రులు, సహృదయులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు, ఆంధ్రప్రభ సంపాదకులు, అనేక నాటికా రచయితలు, తెరవెనుకకు వచ్చి, నాటిక చాలా బాగున్నదని చెపుతూ Progress అనే దానికి అనువాదం కాదాఅన్నారు. ఆంగ్ల నాటిక పేరుకాని రచయిత పేరు కాని గుర్తులేదుకాని విషయంమట్టుకు ఎక్కడో చదివిన దానిస్ఫురణేనని చెప్పాను నాటిక చాలాబాగుంది. కాని పోలీసువారు, దాన్నిగురించి నోట్సు రాసుకుంటున్నారు. కాబట్టి దీన్ని కొంతకాలం వరకూ ప్రదర్శించడం మంచిది కాదన్నారు. తరువాత విజయవాడ, రాజమహేంద్రవరం కాకినాడ వగైరా పట్ట

ణాల్లో ప్రదర్శించాను. ఏ పేచీలేకుండా. అసలుకు, సిసలైన నకలుకాదు. అయినా నారచనబాగుండకపోతే, అసలుగ్రంధక ర్తకు నా అసమర్థతను విన్నవించుకుంటూ మన్నించమని కోరుకుంటున్నాను. ఇక తక్కిన నాటికలు అన్నీ స్వతంత్రములే. సాంఘిక జీవితంలో ఎటుచూచినా అనేక రకములైన అసందర్భాలూ, తారతమ్యాలూ, పరస్పర వైరుధ్యాలూ, నాకు తరచుకనపడుతూ ఉంటాయి. మానవుల ఊహలలో కాని, మాటలలోకాని, చేష్టలలోకాని, ఈ వైరుధ్యం, సంఘర్షణా ఉన్నచోట నాటకం ఉండితీరుతుంది. ఈ లాటి నాటకాలకు బీజం, ప్రతిరోజూ, ప్రతిఇంటా, ప్రతిసోటా మనకు ప్రత్యక్షమవుతూనే ఉంటుంది.

మొక్కుబడిలో చూపించ తలచినదిదే-పురాతన సంస్కారమునకు మూలకందంభక్తి, విశ్వాసం; ఆధునికులకు అవసరమైనది, అతిశయమైన ఆత్మ విశ్వాసం అధికార తిరస్కారం, నిరసన. పై ఉద్యోగినుంచి పరమేశ్వరునివరకూ అంపరూ ఒకటే, అధికారవర్గంవారిఅవసరం మాకు ఎంతమాత్రంలేదు. ఇందులో ఏ ఒకరుకాని ఇంతమందీకాని లేకపోయినా సృష్టిక్రమం ఆగదు. ఇవి ఈనాటి యువక తత్త్వం. ప్రతిఇంటా ఆలు ఆచార సంపన్నురాలు. మగడు నవనాగరికుడు. సంఘర్షణ రాకుండా ఎలా ఉంటుందీ. ఎటొచ్చీ సంసారాలు సాగుతున్నాయంటే మనగృహిణులకున్న పూర్వాచారపరాయ.ణత్వమే ఆధునికులైనా అక్కడా అక్కడా ఉన్న ఆడంబరం, డంబం దర్పం, పరీక్షా సమయంలో నిలవడం కష్టం. కష్ట సమయంలో, దిక్కుకానక,తమ అవిశ్వాసంలోనైనా పూర్ణ

మైన విశ్వాసంలేక, పోనీ ఆ దేవుడనేవాడికో Chance ఇచ్చి చూద్దాం అనే తత్వంనుకుమార్‌దీ, ఆ జాతి వాళ్ళదీని.

స్త్రీలలో చాలామందికి చదువు ఉన్నా లేకపోయినా పూర్వాచార పరాయణత్వం Conservatism ఎక్కువ. పురుషులు చదువుకున్నా చదువుకోకపోయినా ఆధునిక పాశ్చాత్య సంస్కారమును సంపాదించడమో లేక ఉన్నట్టు నటించడమో, పరిపాటు అయింది. అందులోనూ ' పాతివ్రత్యం ' నాయకుడు రమణారావు లాంటి విద్యాధికుడు, ఆధునికుడు, 20 వ శతాబ్దంలో వాడు, పదహారో శతాబ్దంలో ఉండవలసిన మునిపిలాటి భార్యతో మర్యాదగా కాపురంచేస్తూన్నా మానసికానందంకోసం మరో మాడరన్ మగువతో మక్కువగా ఉంటున్నాడంటే ఆశ్చర్యమేముంది. లేదనుకోండి. కాని, పతి పరకాంతతో కాలక్షేపం - సత్కాలక్షేపమే అనుకోండి - చేస్తున్నాడంటే ఎంత పతివ్రత అయినా బాధపడకుండా ఎలా ఉంటుందీ. ప్రాచ్యపాశ్చాత్య నాగరికతల భావ సంఘర్షణ ఈ రెండు నాటికలలోనూ రెండు రకాలుగా ప్రదర్శించడానికి ప్రయత్నించాను.

ఆధునికులలో కనపడే మరొకవిచిత్రలక్షణం, అసంతృప్తి. ఉన్నది చాలదు. లేనిది కావాలి. అది ఊరికే రావాలి. దానికి కృషిచెయ్యకూడదు. శ్రమపడకూడదు. తమకు లేదనిఉన్న వాళ్ళు తెలుసుకొని, వారి కున్నదంతా ఊడ్చి వారికి దిమ్మరించాలి. సునాయాసంగా, నిమిషాలమీద, కీర్తికాంత, ధనలక్ష్మి వారిని వరించి స్వయంగ్రాహ మివ్వాలి. అప్పుడు వారు అర్ధనిమీలిత నేత్రాలతో, మందహాసంతో వారిని వీక్షించి

కట్టాక్షించాలి, ఆ జాతివాడు 'వారసత్వం' నాయకుడు 'వెంకట్రావు.'

సహాయ నిరాకరణోద్యమం దేశంలోకి కొత్తరకం మను ష్యులను దింపింది - అనగా ఇక్కడివాళ్లనే అలా తయారు చేసిందన్నమాట. ఆ జాతివారనేకచోట్ల అనేక రకాలుగా కన పడుతూఉంటారు. ఇల్లూ, ఇల్లాలూ, సంసారం ఏమీలేకుండా, సర్వసమత్వం సాధించి అహింసా, సత్యములను దైనందిన జీవితంలో ఆచరణలో పెట్టవలెననే మహదాశయంతో కృషి చేస్తున్నా మనుకునే ఆదర్శజీవులు అనేకమంది ఉన్నారు. వారి చర్యలూ పట్టుదలలూ ఆదర్శరహితమైన నిత్యజీవనంలో ఎంతో హాస్యాస్పదంగా ఉంటాయి. పెద్దమామయ్య జీవితం, పాపం, అలాటిదే.

ఇక సామాన్యంగా అందరి అనుభవంలోనూ ఉన్న, ప్రత్యే కాంధ్రలక్షణం, 'అసాధారణ సమావేశం'లో కనపడుతుంది. అత్యంతోత్సాహియైన యువకుడు, తన పరిమిత ప్రజ్ఞావిశే షాలను గుర్తించక లోకం మరమ్మతు చేదామనే మహదా శయంతో 'అఖిలభారత సర్వోద్ధరణ సంఘ' మనేసంస్థనొక దానినిస్థాపించి, దానికి తాను కార్యదర్శియై, పదిమందిని పోగు చేసి ఏదో నిలవాకం చేదామనుకుని, అసాధారణ సమా వేశమొకటి సమావేశపరుస్తే, వచ్చిన పదిమందీ తలోరకం గానూ లాగి, పట్టి బాతాఖానీతో, చిల్లర పేచీలతో, ఆత్మస్తుతి పరనిందలతో పని సాగానీయకుండా చేశారు. ఈ అసాధారణ సమావేశంలో ప్రదర్శితమైన స్వభావం, మన ప్రత్యేకత అని మనమంతా ఒప్పుకోక తప్పదు.

హాస్య రచయితకు మనుష్యులమాటలు చేష్టలు, వైష

మ్యాలు, తారతమ్యాలూ అన్నీ కథా వస్తువులుగానే కనపడ తాయి. వాటిని సద్వినియోగం చెయ్యటం, సమర్థతతో, సర నంగా ప్రదర్శించడం అందరకూ సాధ్యమైన పనికాదు. అందులోనూ నాటికా రచన, ఆ శిల్పం, చాలా కష్టమైనవి. అనుకోకుండా, తగిన సమర్ధత లేకపోయినా ఈ రచనకు సాహసించాను, 'Fools rush, where wise men fear to tread' అనే సూక్తిజ్ఞాపకం వస్తోంది. కాని, ఈ నాటికలు పత్రికలలో పడ్డప్పుడు, రంగంమీద ప్రదర్శించి నప్పుడు, రేడియోలో వినిపించినప్పుడు, రసికులు, సహృ దయులు, 'పరవాలేద'ని శిరఃకంపన చేశారు. అందుచేత వాటిని ప్రకటింప సాహసించాను. మరేమీ అనుకోకండి - అనకండి.

ఇంకొక్కమాట.

ఈ నాటకాలలో ఉదాహృతములైన పద్యాలు భర్తృహరి, రాయప్రోలు, విశ్వనాధ, వేదులవార్లవి. వారివారికి నా కృత జ్ఞత తెలుపు కుంటున్నాను.

మొ॥ స॥ శాస్త్రి.

